





# ధర్మము

## విచారణ

# మహామంత్రాతీత ప్రభావము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100067523



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక.


| | | |
|---|---|---|
| 1. | పీఠిక. | పేజీ |
| 2. | మహామన్త్రాతీత ప్రభావము. | 1 |
| 3. | శీలావతీ చరిత్రము. | 11 |
| 4. | మాండవ్యమహాముని చరిత్రము. | 18 |
| 5. | దశగ్రీవుండు శివుని వలన వరముల బడయుట. | 25 |
| 6. | శ్రీ సీతాదేవి అగ్నిప్రవేశమును చేయుట. | 29 |
| 7. | దేవేంద్రుడు శాపగ్రస్తుడగుట. | 35 |
| 8. | అహల్యా శాపకారణము. | 40 |
| 9. | నహుష చరిత్రము. | 43 |
| 10. | ధర్మరాజ చరిత్రము. | 53 |
| 11. | బ్రహ్మ శాపమునొందుట. | 59 |
| 12. | సర్వసారాంశము. | 66 |



ఓమ్.

# పీఠిక

ఈ గ్రంథముయొక్క సారమంతయు ఆచరణపై ఆధారపడియున్నది. ఇప్పుడుకూడ ప్రపంచములో బ్రహ్మనిష్ఠులు ఎక్కువమంది లేక పోయినను కొద్దిమంది అయినా యుండియే యున్నారు. వారలలో చాలామందికిన్ని సరియైన అనుష్ఠానములేనందుచే పండితులకు, గౌరవనీయులకు, శ్రీమంతులకు, రాజులకు, బ్రహ్మవిద్యయందు విశ్వాసములేక పోవుచున్నది. అట్టి దోషముచే బ్రహ్మనిష్ఠచేయువారికి చాలునంత సహాయము చేయకపోవుచున్నారు. దీనివల్ల బ్రహ్మవిద్య వృద్ధినొందక పోవుటయేకాక నిస్సహాయులగు బ్రహ్మచారులకున్ను, సాధువులకున్ను, తగినంతసహాయము లభించుటలేదు. ఇట్టిపుణ్యజీవులకు సహాయముచేయనందుచే పైచెప్పినగృహస్థులు పవిత్రులగుటకు మార్గములభించుటలేదు. కావున మంచి సత్య ధర్మ నిష్ఠగలవారుండిన బ్రహ్మవిద్యవృద్ధినొందుటయేగాక, నిస్సహాయులగువారికి సహాయమున్ను దీనివల్ల శ్రీమంతులు గూడ పుణ్యాత్ములై తరించుటకున్ను, మార్గము యేర్పడును. కావున 1. బ్రహ్మవిద్య వృద్ధినొందుట, 2. నిస్సహాయులగు బ్రహ్మచారులు, సాధువులు, అనుష్ఠానపరులగుట, 3. గృహస్థులు పుణ్యాత్ములగుట, ఇట్టి లాభము లోకమున గలుగును. కనుకనే మనుమహర్షి యీలాగున చెప్పుటకు కారణము.

"శ్లో॥ ఆచారాద్విచ్యుతో విప్రో న వేద ఫలమశ్నుతే।
ఆచారేణ తు సంయుక్తస్సంపూర్ణ ఫలభాగ్భవేత్॥

తా॥ వేదాధ్యయన తత్పరుడై యుండినను ఆచరణయందు జాగ్రత్తలేకపోయిన వేదాధ్యయన తపస్సుల ఫలముననుభవింప జాలఁడు. ఆచరణయందు జాగ్రత్తగలవాఁడు తపస్స్వాధ్యాయేశ్వరపణి

ధానములకు ఎంతఫలము శాస్త్రములో చెప్పబడి యున్నదో, దానిని తప్పక పొందగల్గును. కావున మనకు యిప్పుడు కావలసినది ఆచరణ పరులే. మఱియు భారతదేశము స్వాతన్త్ర్యముగాయుండినప్పుడు బ్రహ్మనిష్ఠులు ఎక్కువమంది యుండిరనియు, అట్టికాలమున విదేశములకుగూడ ధర్మోపదేశము ఈభారతదేశమే చేయుచుండి నటుల చరిత్రము మనకు సాక్షినిచ్చుచున్నది. దేశము అస్వాతన్త్ర్య దీనస్థితికి వచ్చినప్పటినుండియే బ్రహ్మవిద్య పతనమైనదనికూడ చెప్పుచుందురు. దైవకృప చేతను, మహాఋషులకరుణచేతను, మనకు స్వరాజ్యము వచ్చినందుచే యిక ఆ ప్రతిబంధముకూడలేదు. కావున పూర్వపుమన వేదకాలము ననుసరించి స్వాత్మరాజ్యమును పొందుటలో జనులు ప్రవర్తించవలయును. ఈ విషయములలో ముముక్షువులు, బ్రహ్మనిష్ఠులు, సాధువులు, సన్యాసులు, భక్తులు, ముఖ్యముగా ప్రవర్తించవలయును. స్వరాజ్యముతో కూడ ఆత్మరాజ్యముకూడ గలుగునప్పుడే వేదకాలమువలె భారత రాజ్యము శోభించగల్గును. అట్లుగానిచో, దృఢమైన ఇంజన్ మాత్రము లభించి అదిసరి నడపుటకు సరియైన స్టీములోపల లేనట్లే స్వరాజ్యము యుండును. లేనిచో, ఒంటికన్ను ఒంటిచెవి, ఒంటిచేయి, ఒంటికాలు గలవానివలెనె మనముండగలము. అయితే వేదకాలమున కొన్నివర్గములకు మాత్రమే బ్రహ్మవిద్యయందు అర్హతగల్గియున్నట్లు కొందఱు తలంచవచ్చును. అది ఈ మధ్యకాలమున యేర్పడినదే కాని వేదకాలమందుండలేదు. ఏలననగా స్త్రీలలో బ్రహ్మచారిణియగు గార్గియు, సులభయగు సన్న్యాసినియు, బ్రహ్మవాదినియగు మైత్రేయియు, సాక్ష్యములు. ఆలాగున గృహస్థాశ్రమములోయుండిన చూడాల మదాలస మొదలగువారే తార్కాణము. ఆలాగున వసిష్ఠ విశ్వామిత్ర తులాధార సూతాది మహాఋషులున్ను, తార్కాణము. ఇక ఈ జనుల యొక్క యోగ్యత ననుసరించియే అన్నివిషయములలోను అర్హతయేర్పడును నిజముగా అదే సత్యయుగమగును. ఇప్పుడు రాజకీయములో ఏలాగున వారివారి యోగ్యత ననుసరించి అన్నిటిలోను అందఱికిని ప్రవేశమేర్పడుచున్నదో, ఆలాగున ఆధ్యాత్మికవిద్యలోను యుండును. అయితే ఎవరెవరు దేనికి అర్హులు దానికితగిన యోగ్యతనున్ను అందఱు

సంపాదించుకొనవలయును. సోమరులు యేకాలమందును యున్నతస్థితి లోనికి రాజాలరు. ఆలాగున వాచావేదాంతులును బ్రహ్మపదమును పొందియుండలేదు, యుండుటయులేదు, యుండబోరు. ఇదిమాత్రము జ్ఞాపకములో యుంచతగియున్నది.

శ్లో॥ చిత్రామృతంనామృతమేవ విద్ధి చిత్రానలం నానలమేవ విద్ధి।
చిత్రాంగనా నూనమనంగనేతి వాచావివేక స్త్వవివేక ఏవ॥

తా॥ చిత్రములో కనిపించెడుఅమృతను ఎట్లుఅమృతముగాదో, జరానెరలను నివృత్తి జేయజాలదో, చిత్తరువులో చిత్రించిన అగ్ని జ్వాల యేలాగున అగ్నికానేరదో, దేనిన్ని దహింప జాలదో, చిత్త రువులో కనిపించెడు అంగనామణియు యథార్థముగా యేలాగున నారీ మణికాదో, సంసారముచేయజాలదో, ఆలాగున వాచావివేకముతో చెప్పెడు వేదాంతవాక్యమున్ను అజ్ఞానమును పోగొట్టజాలదు. అది వివేకముకాదు. అవివేకమే యగును.

శ్లో॥ ఆచారాల్లభతేహ్యాయురాచారాదీప్సితాః ప్రజాః।
ఆచారాద్ధనమక్షయ్యమాచారోహ్యంత్యలక్షణమ్॥

తా॥ మంచి ఆచరణవలననే దీర్ఘాయుస్సు గల్గును. ఆచరణ వల్లనే జనులు తమ యభీష్టమును పొందగలరు. ఆచరణవల్లనే అక్ష యమగు ధనము చేకూరును. కట్టకడకు ఆచరణ యొక్కటియే, మాన వుని యుత్తమ లక్షణమగును.

శ్లో॥ ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకం।
న నామ గ్రహణాదేవ తస్యవారి ప్రసీదతి॥

తా॥ కతకరేణువు పంకిలజలమును శుద్ధపరచు శక్తిగల్గి యుండి నను, అట్టి చిల్లగింజ నూరిన గంధమును జలభాండములో కలపక మట్టి నీటికుండ దగ్గఱయుండి చిల్లగింజపేరును మాత్రము చెప్పుచుండిన ఆ నీరేలాగున నిర్మలముకాదో ఆలాగున, ఆచరణలేని వేదాంతము యొక్క స్థితినిగూడ విజ్ఞులు తెలిసికొన వలయును.

శ్లో॥ అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకః।
న నశ్యతి తమోనామ కృతయా దీపవార్తయా॥

తా॥ అంధకారనిబిడ గృహాంతరాళమున యుండి ఎన్నిసార్లు దీపముయొక్క వార్తలు నుడివినను, లేక దీపముయొక్క వర్ణనను చేసినను చీకటి నశించదో, తెస్సగా దీపమును వెలిగించినమాత్రమే తమస్సు తొలిగి గృహాంతరాళము ప్రకాశించునో, ఆలాగున, అనుష్ఠానము లేని, వేదాంతవాక్యములును యుండునని జిజ్ఞాసువులు జ్ఞాపకములో యుంచ వలయును

శ్లో॥ ఆచారేణ నరో దేవి! సుఖిత్వముపజాయతే।
అనాచారేణ పాపేన నాశం యాతి తథా ధ్రువమ్॥

తా॥ ఈ వాక్యము పరమశివుండు పార్వతీదేవికుపదేశించినది. ఓ భవానీ! ఆచరణయొక్కదానివల్ల మాత్రమే మానవుడు ఇహాపర సుఖముల పొందగల్గును. అనాచరణచే గల్గు పాపముచేత నిశ్చయముగ నెట్టివాడైనను నాశమునే పొందును.

శ్లో॥ ఇహైవ నరక వ్యాధేశ్చికిత్సాం న కరోతి యః।
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి॥

తా॥ ఈలోకమున, యీమానవ జన్మమున జీవించియున్నప్పుడే అజ్ఞాన రోగమునకు సరియగు చికిత్స చేయడో, అట్టివాడు ఔషధమున్ను, వైద్యుడున్ను ఉపకరణమున్ను లేని స్థలములోనికి వెళ్ళి, వ్యాధిని యెట్లు నివృత్తిచేయ కల్గును? అనగా అన్నిటికిన్ని అనుకూలమైన ఈ మనుష్యజన్మమున, భవరోగమును నివృత్తిచేయక పరలోకమున కేగి అచ్చట యేమిచేయగలుగును? ఈలోకమున చేసిన కర్మఫలమును అనుభవించుటకు మాత్రమే తక్కిన యేలోకమైనను యుపయోగపడును.

శ్లో॥ సోఢ్వాపి కర్మవిక్షేపం చిత్తైకాగ్రే క్షమో యది।
తదా వేత్తు గృహస్థోఽపి ప్రవ్రజత్యన్యథా పుమాన్॥

తా॥ కర్మముచే గలిగెడు విక్షేపములను సహించి, చిత్తమును ఏకాగ్రము చేయుశక్తి గలిగి యుండెనేని గృహస్థాశ్రమమునందు యుండి అయినా ముక్తిని పొందవచ్చును. అట్లుకానిచో మనుజుడు సన్న్యసించవలయును. గృహస్థాశ్రమములో యుండి ముక్తిని పొందవచ్చునా యని సంశయముగలవారందరు దీనిని గ్రహించిన చాలును.

శ్లో॥ యథాభర్జిత బీజస్య ప్రరోహిత్వం వినశ్యతి।
తథాత్మ జ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే॥

తా॥ ఏలాగున అగ్నియందు వేయించిన విత్తనమునకు అంకుర త్వము నశించియుండునో, ఆలాగున, మాయ నశించిన ఆత్మజ్ఞానికి, ప్రాకృతగుణములుగాని, వృత్తులుగాని, సంస్కారములుగాని, యుండవు. అదే దానికి గుఱుతు.

శ్లో॥ న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా।
ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా॥

తా॥ ఈ బ్రహ్మవిద్యయందు కొంచమైనను ప్రమాదమునకు అవకాశము గలుగనీయక మోక్షేచ్ఛ గలవారును, బుద్ధిమంతులును జాగ్రత్తగలిగి యుండవలయును. ఏదైన ప్రమాదము గలిగినచో; సూర్యుడు అస్తమించునప్పుడు చీకటి లోకమును ఆవరించునటుల, మాయ హృదయమును ఆవరించుకొనును. ఓహో! వేదాంతశాస్త్రము ఎంత జాగ్రత్తను తెలిపెనో, దీనివల్ల గ్రహించుకొనవచ్చును. లోక మంతయు, అంధకారమయమగు రాత్రితో కూడినదైనను, ఏ ఇంటిలో దీపము వెలుగుచుండునో, దానియందు తమస్సు ప్రవేశింప జాలనట్లు లోకమజ్ఞానమయమై యుండినను ఏ సాధకుని హృదయమందు జ్ఞానజ్యోతి వెలుగుచుండునో వాని కెచ్చటను ఆవరణము గలుగదు. అజాగ్రత గలిగినచో దీప మాఱినవెంటనే చీకటి ప్రవేశించునటుల మోహాపరవశుడై పోవును.

శ్లో॥ అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే।
ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్॥

తా॥ మూఢుడు అనుభవములేకనే పరబ్రహ్మానుభవము గల వానివలె సంతోషించుచున్నాడు. ఇది యెట్లున్నదనగా - చెరువుకట్ట యందున్న వృక్షాగ్రమందుండుపండ్లు, నీటియందు ప్రతిఫలించుచుండగా దానినిజూచి తాను భుజించినట్లు సంతోషించు వెఱ్ఱివానివలె నుండును. చెట్టెక్కిపండ్లనుకోసి తినవలసి యుండగా, అట్లుచేయక నీటిలో కనిపించు ప్రతిబింబమును పండ్లనితలంచి జలములో దిగి కోయుటకు ప్రయత్నించు వాని స్థితి యెట్టిదో, వాచావేదాంతము యొక్కఫలమున్ను ఆలాగుననే

యుండును. మంత్రాతీత ప్రభావమెట్టిదనగా గీతలో శ్రీకృష్ణభగవానుడుపదేశించినది చూడుడు.

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥

తా॥ బ్రహ్మమును ప్రతిపాదించునట్టి ఓమ్ అను, అనగా ప్రణవమును ఉచ్చరించుచున్నవాడును, ఆ యోంకారమునకర్థమైన పరమాత్మను స్మరించుచున్నవాడును, శరీరమును విడుచుచున్నవాడై యెవడు పోవుచున్నాడో అట్టివాడు సర్వోత్తమమైన మోక్షమును బొందుచున్నాడు. దీనివల్ల మంత్రము దైవమును, ఆత్మను, తెలుపునది మాత్రమనియు, దానియర్థమగు బ్రహ్మమును బొందుటయే లక్ష్యమనియు దెలియందగినది. ఈ రహస్యమునే పతంజలి మహర్షి గూడ యోగసూత్రములో నిరూపించెను. ఇదియు మంత్రాతీతమునే నిర్ణయించుచున్నది.

తజ్జపస్తదర్థ భావనమ్.

తా॥ ప్రణవమునుచ్చరించి ప్రణవార్థమగు బ్రహ్మమునున్ను భావించవలెను. అనగా శబ్దమునుగూడ విడిచి శబ్దార్థమే దైవమని తలంచి దానిలో, నిలకడగల్గి యుండవలయును. మంత్రములన్నియు, తపస్సులన్నియు, యోగములన్నియు, మార్గములన్నియు, అది ప్రతిపాదించు దైవమే తనయొక్క గమ్యస్థానమనియు గ్రహించుకొనేది. శబ్దము ఆకాశగుణమగుటచే ఆకాశము జడమనియు, పంచభూతములలో చేరినదనియు గ్రహించుకొనవలయును. మంత్రార్థము శబ్దాతీతమున్ను, గుణత్రయాతీతమున్ను, అవ్యక్తమునకు పరముగాను నుండునదే సాక్షాద్బ్రహ్మస్థితి యగును. కావున నట్టిస్థితి బొందుటయే మనలక్ష్యమగుటచే మహామంత్రాతీత ప్రభావమని యీ గ్రంథమునకు అట్టి పేరు గల్గుటకు కారణమైనది.

సూ॥ తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్.

తా॥ చిత్తవృత్తులు నిగ్రహమైయుండు కాలమునందు చిన్మాత్రుడైన పురుషుడు,నిజస్వరూపమునందుండుట సంభవించుచున్నది. అందరి

యొక్కయాత్మ, జ్ఞానస్వరూపము. అదియే దైవస్వరూపము. అదీ మంత్రాతీతము. శ్రీ కృష్ణభగవానుడున్ను గీతలో యీ లాగుననే తెలిపెను.

శ్లో॥ క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత॥
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ॥

తా॥ ఓయర్జునా! సమస్తప్రాణికోట్ల దేహముల యందుండెడు క్షేత్రజ్ఞుని (ఆత్మను) నన్నుగా నెరుంగుము. దేహము యొక్కయు, ఆత్మయొక్కయు జ్ఞానమేదికలదో అదియే యదార్థమగు జ్ఞానమని నా మతము. దీనివల్ల ఆత్మయే పరమాత్మయని కృష్ణపరమాత్మమతమగును. ఇదిన్ని మంత్రమున కతీతావస్థనే బోధించుచున్నది. కఠోపనిషత్తున్ను యీ సత్యమునే నిర్ధారణ చేయుచున్నది. "అవ్యక్తాత్పురుషః పరః, పురుషాన్న పరంకించిత్సాకాష్ఠా సా పరాగతిః" అవ్యక్తాత్=అవ్యక్తముకంటె, పురుషః=పురుషుడు, పరః=మహత్తరుడు, పురుషాత్=పురుషునికంటే, పరం=మహత్తరమయినది, కించిత్ న=కొంచెమయినను లేదు. సా=అదియే, కాష్ఠా=అంతమైనది. సా=అదియే, పరాగతిః=సర్వోత్కృష్టమైనది. ఇదిన్ని మంత్రాతీత స్వరూపమునే నిర్ధారణ చేయుచున్నది.

శ్లో॥ గాయత్రి వేదమాతా స్యాత్ మహావాక్యం పితా భవేత్।
ఓంకారస్సర్వమూలం స్యాత్ స ఏవ చ పితామహః॥

తా॥ గాయత్రి వేదముయొక్క తల్లియగును. మహావాక్యము తండ్రియనంబడును. అన్నిటికిన్ని ఓంకారమే మూలరూపమగును. అదియే పితామహుడనంబడును. అనగా బ్రహ్మమని భావము. కావున ఓంకారము అన్నిటియొక్క మూలమనియు, దానియొక్క యర్థమగు బ్రహ్మమే తాను పొందవలసిన స్థితియనియు గ్రహించవలెను. మంత్రాత్మకమైనది వేదము. అట్టివేదము బ్రహ్మమునుగూర్చి చెప్పబడినది గావుననే "న గాయత్ర్యాః పరం మంత్రం" గాయత్రికన్న శ్రేష్ట

మైనమంత్రము లేదు. ఆ మంత్రము బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నది. శబ్దము అర్థము రెండున్ను వేరగుటచే అర్థమును గ్రహించుటయే మన గమ్యస్థానము. అందువల్లనే యీ గ్రంథమునకు మహామంత్రాతీత ప్రభావుని నామధేయము గలుగుటకు కారణమైనది. విజ్ఞులు రాజ హంసమువలె సారగ్రాహులగుటచే దీనియందేదైనలోపము గల్గియుండిన తెలిపిన మఱుముద్రణమున సవరణచేసి ముద్రించుటకు అభిలాష గలవాడను.

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు.

ఓం తత్ సత్.

——:():——



ఓమ్.

ఓం శ్రీ గణేశాయ నమః ఓం నమో భగవతే వేదవ్యాసాయ

# శ్రీ మహామంత్రాతీతప్రభావము

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషంహి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

టీక॥ యేషాం = ఎవరియొక్క, మనః = మనస్సు, సామ్యే = సకలప్రాణులయెడల సమభావమునందు, (జీవేశ్వరుల సమత్వమందు) స్థితం = స్థిరమైయుంటున్నదో, తైః = వారలచేత, ఇహ ఏవ = ఈ దేహముతో యీలోకమునందే, సర్గః = జననమరణములకు హేతువగు సంసారబంధము, జితః = జయింపబడినది, బ్రహ్మ = పరబ్రహ్మము, సమం = సమభావముగలదియును, నిర్దోషంహి = దోషరహితమైనది కదా, తస్మాత్ = ఆ కారణమువలన, తే = అట్టి బ్రహ్మానుభవముగలవారు, బ్రహ్మణి ఏవ = పరబ్రహ్మమునందే, స్థితాః = ఉన్నవారగుచురు.

తా॥ ఎవరియొక్క మనస్సు, సకలభూతములయందును, యీశ్వరుడు సమముగానున్నాడను విషయమునందు, లేక జీవేశ్వరుల ఐక్యభావమందు నిశ్చలమైయున్నదో, అట్టివారు యీ లోకమునందే, యీ దేహముతో కూడియున్నప్పుడే, జననమరణములకు హేతువగుప్రకృతిని జయించినవారగుచున్నారు. మఱియు బ్రహ్మము, ప్రకృతిదోషరహితమైనది. గనుక అట్టి ప్రకృతిదోషరహితులు సదా బ్రహ్మమునందున్నవారగుచున్నారు. అనగా బ్రహ్మస్వరూపులగుచున్నారు. అదియెప్పుడు గలుగవలయునో, యీ క్రిందిశ్లోకము తెల్పుచున్నది.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీనరః॥

టీక॥ యః = ఎవడు, ఇహ ఏవ _ ఈ లోకమునందే, శరీర విమోక్షణాత్ = శరీరమునువిడుచుటకు, ప్రాక్ = ముందుగానే, కామ క్రోధోద్భవం - కామక్రోధజన్యమగు, వేగం = తీవ్రతను, సోఢుం = సహించుటకొఱకు, శక్నోతి = శక్తుడగుచున్నాడో, సఃనరః = అట్టి మనుజుడు, యుక్తః = యోగసిద్ధికలవాడగుచున్నాడు, సః = వాడు, సుఖీ = శాశ్వతమైనబ్రహ్మసుఖము గలవాడగుచున్నాడు.

తా॥ ఏపురుషుడు బ్రతికియున్నప్పుడే కామక్రోధములయొక్క వేగమునుసహింప శక్తిగల్గియున్నాడో, అట్టి పురుషుఁడు యోగియు, శాశ్వత బ్రహ్మానందముగలవా డగుచున్నాఁడు. అని గీత॥ అ॥ 5॥

ఇట్టి స్థితి ముముక్షువులకు, జిజ్ఞాసువులకు, సాధకులకు, భక్తులకు, జీవించియున్నప్పుడే గల్గినదా యని ప్రతిక్షణమున్ను తమలో విచారణ చేయుచుండవలెను. ఇది యుత్తమపక్షము. రెండవదగు మధ్యమ పక్షము గూడ యీ అధ్యాయములోనే శ్రీభగవానుఁడు తెలుపబడమైనది. కట్ట కడకు యిట్టి స్థితిలోనికైన ముముక్షువులు రావలయును.

శ్లో॥ యతేంద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్ష పరాయణః।
విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥

టీక॥ యతేంద్రియమనోబుద్ధిః = స్వాధీనములైన యింద్రియములును, మనస్సును, బుద్ధియు గలవాడును, విగతేచ్ఛాభయక్రోధః = పోయినయాశయు, భయమును, క్రోధమును గలవాడును, మోక్షపరాయణః = మోక్షమునందు ఆసక్తి గలవాడును, సఃమునిః = అట్టి మనన శీలుడు లేక మౌననిష్ఠగలవాడు, సదా = ఎల్లప్పుడు, ముక్త ఏవ= ముక్తుడే.

తా॥ ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని, జయించినవాడును, మోక్షమొక్కదానిని మాత్రము పొందవలెనని తీవ్రమైన కోరికగల వాడున్ను, మననశీలుఁడును లేక మౌననిష్ఠగలవాడున్ను లేక, ముని వృత్తిగలవాడున్ను, విషయాపేక్ష, భయము, క్రోధము, అనునవి లేని వాడునునై యుండునో, అట్టి వాడు ఎల్లప్పుడును, మోక్షమును పొందినవాడే యగుచున్నాడు.

ఎల్లప్పుడును చెప్పుటచే యీ దేహముతో కూడియున్నప్పు డున్ను, దేహము పోయినప్పుడున్ను ముక్తుడే. లేక బ్రహ్మచర్యాది నాల్గు

ఆశ్రమములలో గాని, లేక బ్రాహ్మణాది నాల్గువర్ణములలో గాని, వుండిన వాడైనను, లేక పుణ్యక్షేత్ర పుణ్యతీర్థముల యందుండినను, లేక సామాన్య స్థల, జలముల ప్రదేశములోయుండు వాడైనను, ముక్తుడే. సందేహము లేదు. అయితే యీ శ్లోకములో శ్రీ భగవానుడు నిరూపించిన లక్షణములన్నియు తమకు గల్గియున్నవా అని మాత్రము నిరంతరము ఆత్మతో పరిశోధన సల్పుచుండవలెను. అంతేచాలును. అట్టివాన ధన్యులే.

ప్రస్తుతము ప్రపంచములో గల ముముక్షు జనులలో చాలా మందిన్ని తపస్సులోను, యోగములోను, మహామంత్ర జపములోను, వ్రతములోను, పారాయణలోను, భజనలోను, వేషభాషలలోను, కాలము గడపుచున్నారేగాని యథార్థమగు ఆత్మ శుద్ధికరమగు ఆచరణములో లక్ష్యముంచి ప్రవర్తించువారు అరుదైనందుచేత పూర్వ ఋషులు అనుష్ఠించెడు, తపస్సును మహామంత్ర జపమున్ను, చేయువారైయుండియు, అట్టిమునులు పొందిన స్థానమును పొందకపోవుటకు కారణమని తలంపు గలుగుటచే యీగ్రంథము వ్రాయుటకు కారణమైనది. కావుననే దీనికి "మహామంత్రాతీత ప్రభావమని" నామకరణ మిడుటకు కారణమైనది. ఇది సరియైన శాస్త్రము ద్వారా దృష్టాంత పూర్వకముగను నిరూపింపబడును. మహా మంత్రమునకన్న తన ఆచరణమునకే మిక్కిలి ప్రభావముగలదని యీగ్రంథములో నిరూపింపబడును. అప్పుడు మాత్రమే జనులు మంత్రములలో, యోగములలో గల భ్రాంతిని విడిచి తమ అనుష్ఠానములోనే సర్వమహిమయు, సర్వశక్తియు, కట్టకడకు ముక్తియు గూడగలదని, విశ్వాసముగల్గి అనుష్ఠానముగలిగి వర్తించెదరు. అట్లు ఆచరణయందు నిష్ఠలేని వ్రత, జప, తపములన్నియు ఊషరక్షేత్రములో విత్తిన మంచి విత్తనములవలెను, కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసు వలెను, సరియైన పథ్యములేని దివ్యౌషధసేవ వలెను, వ్యర్థమని తెలిసికొనగలరు.

శ్రుతి॥ ఆచారహీనం నపునంతి వేదాః యద్యప్యధీతాస్సహ షడ్భిరంగైః
ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజన్తం నీడం శకున్తా ఇవజాత పక్షాః

తా॥ (1) శిక్ష, (2) కల్ప, (3) వ్యాకరణ, (4) నిరుక్త, (5) ఛంద, (6) జ్యోతిషములనెడు ఆరుశాస్త్రములున్ను, ఋగ్యజుస్సామాథర్వములగు నాలుగువేదములున్ను కడవరకు చదివి అర్థమును తెలిసికొనినవాడైనను, వాటియందు చెప్పినట్లు చక్కని అనుష్ఠానము లేనివానిని, ఆ వేదములతనిని, పావనమొనర్చజాలవు. ఆవేదములు దేహ వియోగకాలమున, యితనిని విడిచిపెట్టి వెళ్ళును. ఎట్లన? పక్షులు, రెక్కలు వచ్చినప్పుడు గూటిని యెట్లువదలి పోవునో, యితని అధ్యయనములున్ను, ఆలాగున యుండును.

శ్రుతి॥ నావిరతో దుశ్చరితా న్నాశాంతో నాసమాహితః ।
నాశాన్త మానసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్॥

టీక॥ దుశ్చరితాత్=చెడునడతవలన, అవిరతః=చాలించనివాడు, ఏనం=ఈ ఆత్మను, నాప్నుయాత్=పొందడు, అశాంతః= విషయవృత్తులునశించనివాడును, న=పొందడు, అసమాహితః=ఉపరతిని పొందని చిత్తముగలవాడును, న=పొందడు, అశాంతమా సోవాపి=విషయముల నుండి విరక్తిపొందని చిత్తముగలవాడు ,న=యీఆత్మను పొందజాలడు ప్రజ్ఞానేన=ప్రజ్ఞానమను జ్ఞానముచేతనే, ఏనం=ఈఆత్మను, ఆప్నుయాత్= పొందును.

తా॥ చెడునడవడికగల్గి యింద్రియ చలనముడుగక, ఏకాగ్ర చిత్తములేక, విషయములందు వ్యాపించు చిత్తముగల మనుజుడు, యీ ఆత్మను పొందజాలడు. మరెవడుపొందుననగా? చెడు నడతను వదలి, యింద్రియ చలనము లేక, ఏకాగ్ర చిత్తముగల్గి, విషయముల యందు వ్యాపించని మనస్సుగల మనుజుడు, యీ ఆత్మను జ్ఞానముచేత పొందుచున్నాడు. ఇదే రీతిగ మనుమహర్షి చెప్పినదిన్ని చూడుడు.

శ్లో॥ వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసిచ।
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్॥

తా॥ వేదాధ్యయనము, దానము, యజ్ఞములు, నియమములు, తపస్సులు, చెడుమనస్సుగలవాని కెట్టిసిద్ధిని యెచ్చటను గలిగింప జాలవు. అనగా ఆత్మశుద్ధి లేనివానికి పై చెప్పిన వెన్నియు ఉపకారమొనర్ప జాలవు. గీతలోను భగవానుడు ఈ లాగుననే తెలిపెను.

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥

తా॥ మనోనియమములేనివానివల్ల యోగసిద్ధిపొందుట ప్రయాసము అయినను, మాటిమాటికి యెడతెగక మనోనిగ్రహముకొఱకు ప్రయత్నించువానికి అభ్యాసవైరాగ్యములవల్ల యోగసిద్ధిగల్గును. అందువల్ల జ్ఞానముదయించును. ఓమ్.

---

# హరిశ్చంద్రోపాఖ్యానము.

ఇప్పుడు ఆచరణచేగల్గిన మిక్కిలి పావనచరిత్రమగు హరిశ్చంద్రుని గుఱించిన కథయొకటిగలదు. ఇది భారతీయులందఱు ఎఱింగినవిషయమే. సత్యవ్రతముయొక్క మాహాత్మ్యము దీనివల్ల తెలిసికొనఁదగినది. ఇచట ఈగాథ సంగ్రహముగామాత్రమే తెలుపబడును.

## వీరబాహు వాక్యము.

ఇట వీరబాహుండును నిజాధీశ్వరు నాజ్ఞోల్లంఘనంబుచేయఁదలంచి రయంబున నత్యంతక్రూరవృత్తులును, భయంకరకరవాలహస్తులునగు, నిజకింకరులం గనుంగొని మీరలందఱుంగూడి మందగమన నమందగమనంబునం బరేత నికేతనంబునకుంగొని చని యచ్చటంగదలుకున్న వీరదాసునిచేతి కిమ్మచ్చకంటినిచ్చి చంపించుఁడనుటయు, వారునుంబని పూని చంద్రమతిందోడ్కొనిపోయి వీరదాసుని ముందఱంబెట్టి

క॥ క్షితివరు నాసతియును దమ
పతియగు నవ్వీరబాహుపంపునుగ
డు నద్భుతముగ జెప్పిన నదివిని
ధృతిదూలికలంగి యులికె దీనాననయై.

## హరిశ్చంద్రుని వాక్యము.

క॥ మిగులవెఱఁగంది హాహా ♦ జగమునవెవ్వారలింక శకునులువిధిచేత
గడవధైర్యమునిలుపఁగఁ ♦ దగునుల్లములోనవగవఁదగదించుకయుఙ్

చ॥ అరసి రణాంగణంబునఁ దృణాంకురసంగతవక్త్రులన్భయా
కరమతు లన్నిరాయుధుల గర్వము సర్వము నుజ్జగించుచున్
శరణము వేడు వైరులనుసారకృపామతిఁ బ్రోచు నేను
నిష్కరుణఁగృపాణ ధారఁగులకాంతవధింపగ నెట్లుపూనుదున్

క॥ ఈ హరిణనయనఁ గెడపిన ♦ స్త్రీహత్యయుఁ గెడపకున్నఁ జెచ్చెరస్వామి
ద్రోహంబును బాటిల్లెడు ♦ నూహించిననాకు నెద్దియు చితముచేయన్

చంద్రమతి వాక్యము.

వ॥ అనిబాష్పపూరిత నేత్రుండై మొగంబువంచియున్న యన్న రేంద్రునకుం జంద్రమతి యిట్లనియె.

క॥ ఓవసుధాధిపశేఖర ♦ యీవేళఁగని ధర్మమార్గమెందునుగలదే
భావింపధైర్యమెడలక ♦ కావింపగవలయుస్వామికార్యంబెపుడున్।

క॥ ఊహించి చూడ స్వామి♦ద్రోహమమిత భారమనుచు ధొల్లిగరుత్మ
ద్వాహానుని తోడ నిస్సం♦దేహంబునఁ బలికె ధరణిదేవి ప్రియేశా.

చ॥ అదియును గాక రాకొమరునర్భకుఁ జంపెమహా దురాత్మురా
లిది యనునిందఁ బొందితి నరేశ్వరకావున నింక నన్వధిం
పఁదగుఁ దలంచిచూడ నణుమాత్రము నొందు తలంపుమానుఁడీ
హృదయము లోపలంగరుణ యేటికి నిల్పెద రిట్టిపట్టునన్.

తే॥ మానవులు దేవతలును విస్మయము లొదవ
నిచట నచటను బొగడ మహీతలేశ
శంక బొందక మిగుల నిశ్చలతనిలిచి
తెంపు మీఱగ దెంపు మదీయ శిరము.

వ॥ అని యమంద ధైర్యంబునం జంద్రమతి ప్రాణేశ్వరు పదంబుల కెఱగి, ముదంబునఁ గృతప్రదక్షిణయై కరకమలంబులు మొగిడ్చి దరహాస వికాసంబులు వదనంబునం బ్రకాశింప, నిరంతర రక్త పంక సంసిక్తంబైన జూపట్టు వధ్యశిలోపరిభాగంబునం బద్ధాసనంబునం గూర్చుండి మార్తాండ మండలంబుపై జూడ్కి నిలిపి.

తే॥ నిఖిల లోకైక వంద్యయో నీరజాప్త
నాకుఁ గృపతోడ జన్మ జన్మములయందు

సత్య సంశీలుఁడగు హరిశ్చంద్ర నృపతి
ప్రాణ నాయకుగా నొసర్పంగవలయు.

వ॥ అని యత్యంత తాత్పర్యంబున నాదిత్యుం బ్రార్థించి ప్రాణ వల్లభు నుల్లంబునం జేర్చియుండుటయు నవ్వాలుగంటిం గనుంగొని

హరిశ్చంద్రుని వాక్యము.

మహీపాలుండు తదీయధైర్య వివేకంబులకు మనంబున విస్మయం బునం బొంది సకల జగదాశ్చర్యంబుగా నిశ్చలత్వంబునం గదిసి సింధు వేలా వలయిత వసుంధరాభార భరణ సామర్థ్యంబున నొప్పు వామేతర భుజాదండంబున బ్రచండరిపుశిరః ఖండనోగ్రంబగు మండలాగ్రంబమర్చి చంద్రమతి కంఠభాగంబునం గదియించి యున్న సమయంబున.

ఇచట విశ్వామిత్ర మహర్షి ఆవిర్భవించుటయు కొన్ని నీతులు చెప్పుటయు గలదు. అది పూర్తిగా యిచ్చట వ్రాయబడలేదు. ఓమ్.

తే॥ భానుబింబ సముజ్జ్వల ప్రభలు పర్వఁ
గదిసి గ్రక్కున నెడఁజొచ్చిగాధి పట్టి,
చేతిఖడ్గంబు పట్టి ధాత్రీతలేశుఁ
బలికె రోషాతిరేక సంభాషణముల.

ఉ॥ చాలుఁ బురేనరేశ్వర ప్రచండ తరంబగు నిట్టి సాహసం
బేల యొనర్చెదీవు నిను నీక్షణ సేయుగఁ బాతకంబు
చండాలునకైనఁ గొంత కరుణారస ముబ్బు మనంబు లోన
నీబాలికఁ జూచివం గినిసి పాయక చంపు తలంపు పుట్టునే.

క॥ దానవుఁ డవుగా కరయఁగ ♦ మానవుడవె నీవునిన్ను మఁగువలఁజంపం
గానియమించె నెమ్మీఁగురు ♦ వైనవసిష్ఠుండు గడుదురాత్ముఁడవెందున్

వ॥ అనిబహువిధంబులం బోధించు నగ్గాధినందనుంగనుంగొని యమ్మానవాధీశ్వరుండు దరహసితాననుండై.

క॥ ఓ ఋషినాయక యీ సం ♦ సార పయోరాశి తీరసంప్రాప్తునిగాఁ
జేరిచి యీకాశీపురి ♦ గౌరీపతినన్ను వేమఁగరుణ నలంచె

చ॥ ఇతరునిఁబోలె ఒల్లఁడని మునీశ్వర నన్నుఁ బ్రియుంప నేల
యీగతి బహుభంగులం గమలగర్భునకైనను బూనినిల్చి
సమ్మతి భయమేది మీ కెదిరి మాఱ్పలు కంగఁ దరంబు గాదు
దుష్కృత నిబిడాంధకార సరసీరుహ బాంధవ నాకు శక్యమే.

తే॥ పలుమఱును మీకు నిన్ని చెప్పంగనేల
చేతిఖడ్గంబు విడువు కౌశిక మునీంద్ర
ఇట్టి తఱినుండఁ జనదు మీకిచట నిట్లు
వేగవిచ్చేయుఁడిదినాదు విన్నపంబు.

వ॥ అనుటయు నాహరిశ్చంద్ర నరేంద్రుని నిత్యసత్య ప్రభావంబునకు నత్యాశ్చర్యంబునం బొంది మృషావాదిం జేయుదునను తలంపు ముద్రించి విశ్వామిత్రుండు తపోవనంబునకుం జనియె. అఖండ సాహసంబున నమ్మహీమండలేశ్వరుండాఖండల కరవజ్రప్రచండంబగు కరవాలంబున నారోలంబవేణి కంఠనాళంబు ద్రేయుటయు నవ్వేటు ప్రసూన దామకంబుగతి నభిరామంబగుచుఁ బురంధ్రీ శిరోమణిగళంబునం గీలుకొనిన, శిరః కంపంబుచేసి మహీవల్లభుండు.

(జనులారా చూచితిరా సత్యవ్రతానుష్ఠానముయొక్క మహిమాతిశయమును. హరిశ్చంద్రుడు వేసినఖడ్గము పుష్పహారమై చంద్రమతి కంఠమలంకరించెను)

క॥ కలహంస గమన తెవ్వని
గళము నిరీక్షించి వివిధగర్విత రిపు
భూపతుల మెడలు దునుమంగల
కరఖడ్గంబు చూచి కడువిస్మితుఁడై.

తే॥ దారి తప్పెనో గంటి యీ తమ్మికంటి శిలమెట్టిదో కాక
కౌశికమునీంద్రు జాలమో మద్భుజాశక్తి దూలి చనెనో
పొంగియుంకొక్కమాటు ద్రేయంగవలయు.

క॥ అసిపోవగ వచ్చునెనా
యసి పోవక యంచు మిగుల నాగ్రహాలీలం
గొనరక మఱియు నుహుమ్మనియసమగతిం
బూని, ద్రేయు నాసమయమునన్.

శా॥ పక్షీంద్రధ్వజపద్మజ ప్రముఖులా బర్హిర్ముఖు ల్గొల్వగా
నుక్షాధీశ్వరు నెక్కి శైలతనయా యుక్తంబుగా భక్తసం
రక్షా దక్షుఁడు విశ్వనాథుఁడు సువర్ణగ్రావ కోదండిదా
సాక్షాత్కారముఁ బొందె సత్యపహరిశ్చంద్రు క్షమాభర్తకున్

సీ॥ ఆకాశగంగతో నమృతాంశు రేఖతో
బల్లవారుణ జటాభరముతోడ
ఫాలలోచనముతో ఫణి కుండలములతో
గాలకూట వినీల గళముతోడ
హరిణ డింభంబుతో నజగవ ధనువుతో
డమరు శాతత్రిశూలములతోడ
నజ శిరోమాలికా గజచర్మములతోడ
భసితాంగరాగ విభ్రమముతోడ.

తే॥ సౌరభోజ్జ్వలపుష్ప వర్షంబు తోడ
దివిజ సందోహ రణిత వాదిత్రశబ్ద
సహిత నారద వల్లకీ స్వనముతోడ
శివుడు గిరిరాజ కన్యకాధవుడు పొలిచె.

(హరిశ్చంద్రునికి గల్గిన యీ యీశ్వర సాక్షాత్కారము, మంత్ర జపముచేత గాదు, యోగనిష్ఠ చేతగాదు, తపస్సుచేతనుగాదు. నిర్మలమగు సత్యవ్రత పాలనచేతనే కలిగినదని తెలిసికొనుడు.)

వ॥ ఇవ్విధంబునఁ జంద్ర శేఖరుండు ప్రత్యక్షం బగుటయు, నవ్వసుంధరాధ్యక్షుండత్యంత భక్తితాత్పర్యంబును, సంభ్రమంబును, ప్రియంబును, భయంబును, వినయంబును, విస్మయంబును, నయంబును, నుల్లంబున నొక్క మొగిం బిక్కటిల్ల దేహంబునం బులకాంకుర సమూహంబుల సమానంబులై జనియింప నానంద బాష్పబిందు బృందంబులు నయనారవిందంబులం దొరుంగ సాష్టాంగ దండ ప్రణామంబాచరించి లేచి నిలిచి ముకుళిత కరకమలుండై

సీ॥ జయ పార్వతీమనోజలజాత మార్తాండ
జయ రసాతల విభూషణ కరుడ

జయ గజాసుర గర్వజలద జగత్ప్రాణ
జయ భక్తలోక రక్షాధురీణ
జయ ఫాలలోచన జ్వలన జితానంగ
జయపాణి సంభృతోజ్జ్వల కురంగ
జయ వియద్వాహినీ శశికటాకోటీర
జయ కుందచందన సమశరీర

తే॥ జయ రమాధీశ భారతీ ప్రియ
పురందరాది గీర్వాణ మకుట విన్యస్త
రత్నపటల శోభా విభాసిత పాదపద్మ
జయ మనోహర కలధౌత శైలసదన.

క॥ అని బహువిధముల భక్తిని ♦ వినుతించుచున్న భూమివిభుజూచి
కృపావనరాశిభక్తజన శోభనదాయి ♦ మహానురాగ భరితాత్ముండై.

ఈశ్వర వాక్యము.

సీ। ఇది ప్రేతభూమిగా దినకులేశ్వర
పావనంబగు యజ్ఞ వాటంబుగాని
యస్థి ప్రోవులునుగా వమితసూనృతి
వచస్సౌభాగ్య బహుసమిత్సమితిగాని
ఘన కపాలములు గావన వధ్యసాహస
విమలోపకరణ పాత్రములు గాని
రక్త పూరముగాదు రాజన్య లోకైకనాథ
హయ్యంగవీనంబు గాని.

తే॥ కడిది కొఱ్ఱులుగావు సంగర జయాంక
పాదు కొల్పిన భూరి యూపములు గాని
చికుర జాలంబు గాదు శిక్షిత సమస్త
విమత నరపాల నవకుశ వితతిగాని.

క॥ ఓరి నిను భృత్యునింగా ♦ నేలిన నవీరబాహు డిలలోపలఁ
జండాలుఁడు గాఁడు కృతాన్తుఁడు ♦ నాళీక హితాన్వయాబ్ధి నక్షత్రేశా.

తే॥ నీకు డెందంబులోన సందేహమేల
చేరి విశ్వాస మొదవ వీక్షింపు మనుచు
శుద్ధమతి దివ్యదృష్టి యిచ్చుటయు
సర్వమును గనుంగొని వెఱఁగందె మనుజవిభుడు.

మానవుని యొక్క ఆచరణలోఁగల ప్రభావ మెట్టిదో దీనివల్ల గనుగొనవచ్చును. ఈ పద్యములు "హరిశ్చంద్రోపాఖ్యానము"లోఁగలవి.

హరిః ఓమ్.

---

ఓమ్.

# శీలావతీ చరిత్రము.

ఈ చరిత్రముగూడ సంగ్రహముగానే ఇచ్చట వ్రాయబడును. ఈనారీమణియు తనయొక్క పాతివ్రత్యశీలముచేతనే మూడుదినములు సూర్యుని ఉదయింపకుండునటులుచేసెను. ఇదియు మంత్రపురశ్చరణచేత గాని, తపశ్శక్తిచేతగాని, యోగశక్తిచేతగాని, గల్గినదిగాదు. తనయొక్క వ్రతమహిమవల్ల నేగల్గెను. ఇంతమహాశక్తి, యే యోగిగాని, తపస్విగాని, భక్తుడుగాని చేసియుండలేదు. దీనివల్ల అన్నిటికన్న మానవునియొక్క ఆచరణయే గొప్పది అని అర్థమగుచున్నది, అదిలేనిచో తక్కినవన్నియు యుపయోగములుగావు. సత్యముగూడ ఆచరణయేయగును. అట్టి ఆచరణ యుండినమాత్రమే, ఆత్మవిశ్వాసము, హృదయములో దార్ఢ్యము, శుద్ధసంకల్పము గల్గును.

శ్లో॥ జపవ్రతధ్యాన తపాంసి యోగాః
ఆచారహీనం న పునన్తి లోకే।
తేచైవ నిత్యం సుదృఢం కృతాశ్చే
దాచారవన్తం చ పునన్తి సత్యమ్॥

తా॥ ప్రపంచములో, దివ్యమంత్రజపముగాని, ఏకాదశ్యాది వ్రతముగాని, భగవద్ధ్యానములుగాని, కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సుగాని, యమ నియమాద్యష్టాంగ యోగముగాని, ఆచరణలేనివానిని పవిత్రునిగా జేయజాలవు. అవియన్నియు, మంచి ఆచరణతో దృఢబుద్ధితో చేయ

బడినేని, అట్టివానిని ఆజప వ్రతధ్యానాదులు తప్పక నిర్మలునిగాజేయగలవు. ఇదిసత్యము. భూమిసారవంతమైనను శ్రేష్ఠమైన విత్తనములు దానియందు వేసినను, సకాలవర్షములేనిచో ఎట్లువ్యర్థములో, ఆలాగున మంచివంశములోజన్మించినవాడైనను, దివ్యమంత్రజపధ్యానాదులు జేయువాడైనను, సత్యధర్మములతోగూడిన ఆచరణలేనిచో అవిఫలమును గలుగజేయజాలవు.

శ్లో॥ ఐశ్వర్యజాతిధనయౌవనశక్తివిద్యాః
సన్మార్గగామిపురుషం బహు శోభయన్తి।
తాఏవ దుష్టపథగామిషు కోపయుక్తాః
కుర్వన్తితానపయశోభరితాంశ్చనిత్యమ్॥

తా॥ ఐశ్వర్యము, ఉన్నతజాతి, ధనము, యౌవనము, తనశక్తి, మంచివిద్య, ఇవన్నియు సదాచారముగల పురుషుని మిక్కిలి శోభింపజేయును. అవియే, సదాచారములేని మార్గములో సంచరించువానిపై గొప్ప కోపముగలనై, నిత్యము అతనిని అపకీర్తిపాలుచేయును. అనగా భ్రష్టునిగానొనర్చును. కావున వేదాంతోపదేష్టలగు గురువులు ముఖ్యముగా యీవాక్యమును జ్ఞాపకములోనుంచుకొనవలయును.

శ్లో॥ అశ్వమేధ సహస్రంచ సత్యంచ తులయాధృతం।
అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే॥

తా॥ పూర్వము ఋషులు సహస్రాశ్వమేధ పుణ్యఫలమును, సత్యమును, త్రాసులోపెట్టి తూచినారట. అశ్వమేధయాగ పుణ్యఫలమునకన్న సత్యముయొక్క పుణ్యఫలమే అధికముగా యుండెను. ఇదియు మానవునియొక్క పావన ధర్మానుష్ఠానమునే కొనియాడుచున్నది. సామాన్యముగా కొందఱు తాము చేయుచున్న పనులలో కొంచము అసత్య దోషముండినను ఆద్రవ్యము ధర్మకార్యములలో వినియోగపరచుటవల్ల దోషముగలుగదని తలంతురు కాని, ఎన్ని యజ్ఞాదిక్రతువులు చేసినను సత్యమునకు సమానము కావని, శాస్త్రము తెలుపుచుండగా మరల యేల పాపకార్యమును చేసి పుణ్యకార్యములలో ప్రవర్తించవలయును? ఇది విషయుక్తపదార్థమును భుజించి, ఆదోషమువల్ల బాధపడునప్పుడు విషవిరుగుడు ఔషధమును సేవించి సౌఖ్యమొంద

తలంచినట్లుండును. దీనికన్న విషయుక్తవస్తువును భుజింపక యుండువాడు కదా శ్రేష్ఠుడు. మరియు యజ్ఞాదిదాన ధర్మములచే గలిగెడు ఫలితము స్వర్గలోకప్రాప్తి; పుణ్యము క్షయించిన వెంటనే స్వర్గ లోకముననుండి భూలోకమునకు త్రోయబడుదురు. సత్యముచే గల్గెడు ఫలితము ఆ లాగున పతనము పొందునదిగాదు. అది శాశ్వతమగు బ్రహ్మపదమును నొసగునది. కావున ఈ రెండింటియొక్క లఘుత్వగురుత్వముల జూచుకొనియే విజ్ఞుడు ప్రవర్తించవలయును. మఱియు సత్కర్మమైనను, అది మువ్విధములు- పాపము గలుగని ధనముచే ఫలాపేక్షరహితమగు పుణ్యకర్మము ఉత్తమము. స్వల్పము పాపసంబంధముగల ద్రవ్యముచే చేసెడు సత్కర్మలున్ను, పేరు ప్రతిష్ఠల నుద్దేశించి చేయబడునదియు మధ్యమ మని అనంబడును. పాపసంబంధ సొమ్ములచే స్వార్థలాభము నుద్దేశించి చేయునది సత్కర్మమైనను, అది అధమమనంబడును. మొదటిది శుద్ధమనియు, రెండవది మిశ్రమమనియు, మూడవది నీచమనియు, జ్ఞానులు తలంతురు. మొదటిదానివల్ల బ్రహ్మలోక ప్రాప్తియు, రెండవదానిచే స్వర్గలోకప్రాప్తియు, మూడవదానిచే నరకలోక ప్రాప్తియు, గలుగునని ఆత్మవేత్తలు తెలిసికొని యున్నారు.

## శీలావతిని గుఱించిన కథ.

ఉగ్రతపస్వియను పేరుగల మాముని పూర్వము శీలావతియను పేరుగల ఋషికన్యను విధిప్రకారము వివాహము చేసికొని కాననమున పవిత్రమగు నొక యాశ్రమమును నిర్మించి, కాంతాసమేతుడై తపస్సు జేయుచుండెను. భార్యయొక్క పాతివ్రత్యధర్మమును తెలిసికొనుటకు తనయొక్క తపోమహిమచే, గొప్పవృద్ధునిగాను, కుష్ఠువ్యాధి గలవానిని గాను, తనను చేసికొనెను. నడచుటకు శక్తిలేని స్థితిలో యుండునటుల నటించి, ఒకదినము రాత్రి కారుచీకటిలో గ్రామముననొకగృహమందు వెళ్ళవలసి యుండుటచే భార్య తనభుజముపై ఎత్తుకొని పోవుచుండగా శూలమున పడియుండు మాండవ్య మహాముని పాదములపై మాముని యొక్క శిరస్సు తగులుటచే, ఆ మాండవ్యమహర్షి చాల బాధగలిగినవాడగుటచే, తనకు ఈ బాధను గలిగించినవాడు రేపు సూర్యోదయమునకు ముందుగా మరణించునటుల శాపమిచ్చెను. మాండవ్యముని

శూలముపై యుండుటకు కారణము మరల తెలిపెద. భాస్కరోదయమునకు పూర్వముగా మృత్యువు సంభవించునని ఎఱింగి విచారపడుచుండగా, పతివ్రతాశిరోమణియు తపస్వినియుయగు శీలావతి, భర్తతో నీలాగునవచించెను మామునీంద్రా! మీరు ఆజ్ఞ యిచ్చితిరేని రేపు సూర్యుడుదయింపకుండు నట్లుల చేసెద, అనువాక్యమును వినిన వెంటనే ఆలాగున చేయవచ్చును అని ఆజ్ఞాపింపగా, సూర్యుని, గుఱించి నిలిచి నిశ్చలముగా నిలపెట్టిన విగ్రహామువలె చిత్తైకాగ్ర్యతతో సూర్యుని గుఱించి తపమొనర్చెను. ఓ తేజోమూర్తీ! నీకు కర్మసాక్షియను నామధేయము సార్థకమగునేని నేను చేయుచుండు పతిసేవయు, తపోవృత్తియు నీవునిత్యము చూచుచునే యున్నావు. నాపాతివ్రత్యధర్మము, శుద్ధమగు దినచర్య, ఇంద్రియ నిగ్రహము, సత్యమునైనచో నాకు మాంగల్యహాని గలుగనీయక, వరమియ్యవలయును. నీవు ఉదయించితివేని మాండవ్య మహర్షియొక్క శాపాగ్నివలన నాభర్త మరణించును. కావున నాకు పతిభిక్షనొసగుమని పూర్వదిక్కున దృష్టినినిలిపి తపమొనరింప ప్రారంభించెను. ఈ మహాతియొక్క వాక్యములు విని సూర్యుడు యుదయింపకనే ఆగిపోయెను. ఆలాగున ఒకరోజుగాదు, రెండురోజులుగాదు, మూడుదినములవరకును సూర్యుడుదయింపలేదు. ఆదిత్యోదయముగానందుచే వైదికకర్మలన్నియు ఆగిపోయెను. దేవతలును, చారణులును, విద్యాధరలును, కిన్నరులును, కింపురుషులును, అచ్చోటికిచ్చోటికి పరుగెత్తి భాస్కరోదయము కాకుండుటకు కారణమును ఒకరికొకరు అడుగుకొనుచుండినను నిజము తెలియక పరిభ్రమించుచుండగా శీలావతియొక్క ఘోరమగు తీవ్రతపస్సువల్ల సూర్యుండు ఉదయించుటలేదని తెలిపి సర్వసురులును, త్వరలో సృష్టికర్తయగు బ్రహ్మసమీపమునకు వెళ్ళి ప్రార్థించిన యీ ఆపత్తుతొలగునని తెలుపగా, దేవేంద్రుడును, దేవతులును, కిన్నరకింపురుషులందఱును, బ్రహ్మదేవుని సమీపించి వృత్తాన్తమును తెలియపరచగా, దీని నివారణోపాయము తనచే సాధ్యముకాదనియు, దీనికి సాక్షాచ్ఛంకరుడే సమర్థుడనియు, నేనున్ను మీతోగూడ చంద్రచూడుని స్థానమునకువచ్చెద అని తెలిపి, కైలాసవాసియగు పరమశివుని సమీపించి విపన్నివృత్త్యుపాయము తెలుపుమనగా దయామయు

డగు కాలకంఠుడు మనమందఱమును శ్రీమన్నారాయణుని దగ్గరకువెళ్లె దము. అట్లైనమాత్రమే యీ ఘోరవిపత్తు నివర్తించునని తెలుపుచు, దేవతులందరితోను, బ్రహ్మతోను, ఈశ్వరుండుచేరి క్షీరసాగరతీరమున శ్రీవిష్ణుభగవానునిగురించి స్తోత్రముచేసిరి. అప్పుడు జనార్దనుండు మంద హాసముఖారవిందముతో గూడినవాడై ఆవిర్భవించి, ఈశ్వరబ్రహ్మాది దేవతల ఆగమనమునడుగగా, వృత్తాంతములన్నిటిని విస్తరించి తెలిపిరి. అప్పుడు శ్రీవైకుంఠనాథుడు, యీపని నాకున్ను సాధ్యపడునది కాదు. అత్రియనుపేరుగల తాపసశ్రేష్ఠుని ఆశ్రమమునకు మనమందఱమువెళ్లిన మాత్రమే, యీ ఆపన్నివారణోపాయము గలుగునని చెప్పుచు, శ్రీ విష్ణువున్ను, పైజెప్పిన దేవతలందఱున్ను, అత్రిమహర్షి ఆశ్రమమునకు వెళ్ళిరి. బ్రహ్మాది దేవతలందఱిని అత్రిమహర్షి నమస్కరించి శీలావతి యొక్క తపఃప్రభావముచే, సూర్యుడుదయింపకపోవుటవల్ల నిత్యనైమి త్తికయజ్ఞాది కార్యములన్నియుజరుగుటలేదు. భాస్కరోదయమునకుపా యమెదియో, ఆనతియ్యవలయునని బ్రహ్మాదిదేవతలందఱు చెప్పినవాక్య మునువిని. అత్రి, మహాపతివ్రతయు, తపస్సుచే కృశించినశరీరముగల తన ధర్మపత్నియుయగు అనసూయకు వృత్తాంతమంతయు తెలిపెను. బ్రహ్మ, విష్ణు, శివ, ఇంద్రాది దేవతలు మీ దర్శనార్థమై వచ్చియున్నారనియు, తపస్వినియగు శీలావతి మాంగల్యమునకు హానిగలుగకయు, సూర్యుడుద యించి లోకములో జరుగుచుండు యజ్ఞాదికార్యములన్నియు నిర్విఘ్న ముగా జరుగుటకుపాయమెద్దియో ఆలోచించుకొనుమనియు, ఆ అన సూయాదేవితో తెలిపెను. దానిని వినినవెంటనే ఆ అనసూయ తపో మూర్తియగు మాయనుగ్రహముండిన, శీలావతి తపమొనరించెడు పుణ్యప్రదేశమునకువెళ్ళి, శీలావతి పతికి భంగముగలుగకయు, సూర్యు డుదయించులాగునను చేసెదనని వచించి, అత్రిమహామునికి ప్రదక్షిణ నమస్కారమొనరించి, ఆజ్ఞనుపొంది, బ్రహ్మ,విష్ణు, శివ, ఇంద్రాది దేవత లతోసహా, శీలావతిచేయుచుండు ఉగ్రతపఃప్రదేశమునకుజనిరి. అప్పుడు భిత్తిలో చిత్రించినచిత్తరువువలె నిశ్చలనిష్ఠలోయుండి తపమొనరించెడు శీలావతితో అనసూయ యీలాగునపలికెను-తల్లీ! తపముచాలించుము. సూర్యోదయముగాకపోయిన లోకములో ఒకాలుకార్యభంగముగల్గును.

విప్రుల నిత్యకర్మములన్నియు ఆగిపోవును. జనుల ధర్మకార్యములేమియు జరుగవు. ప్రపంచమంతయు అంధకారమయమైపోయినది. చోరులు విజృంభించి జనులను చాలబాధపెట్టెదరు. పశువులు మేతలేక గోడుగోడు మని అరచుచున్నవి. ఈలాంటి అకాలప్రళయము ఏకాలమునను జరిగి యుండలేదు ఇకను భాస్కరోదయము గలుగకుండుటచే కల్గెడుకష్టము లన్నిటిని చెప్పుచుండు అనసూయాదేవి వాక్యములను విని నిష్ఠాగరిష్ఠురా లగు శీలావతి ధ్యానమునుండి బహిర్ముఖముగలదై, అర్ధోన్మీలిత నేత్రయై యీలాగున వచించెను- ఓ దేవీ! నాభర్తకు ఆపతునుగలుగ నీయక సూర్యుడుదయించు యుపాయముండిన తపమును నిలిపెద, అను వాక్యమునువినగానే అనసూయ, ఆలాగునభర్తకు మరణముగలుగకయు, మీ మాంగల్యసూత్రమునకు చెరుపుగలుగకయు, సూర్యుడుదయించు లాగున చేసెదనని తెలుపగా, శీలావతి తనఘోరతపమును ఉపసంహారించు కొనెను. అప్పుడు సూర్యభగవానుడుదయించులాగున ప్రార్థింపగా, వెం టనే ఉదయగిరియందు భానుడావిర్భవించెను. వెంటనే,శీలావతిపతియగు మాముని ప్రాణవిరహితుడై భూమిలో పడెను. అత్తరి అనసూయాదేవి శీలావతితో భయపడకుము, లోకమునుసృష్టించు, పాలించు,సంహారించు శక్తిగలత్రిమూర్తులు వచ్చియుండగా; నీభర్తయొకరిని ప్రాణమిచ్చిరక్షిం చుట కశక్తులగుదురా? అత్తరి బ్రహ్మదేవుడు జలమును కరములోధరి యించి అభిమంత్రించి మాముని ముఖమండలమున ప్రోక్షింపగా, నిద్ర నుండిలేచినవానివలె మాముని లేచికూర్చుండెను. సూర్యుడుదయించిన వెంటనే విప్రులు నిత్యనైమిత్తిక కర్మముల అతిసంతోషముతో చేయ దొడంగిరి. హోమమొనర్చుటచే సుగన్ధధూపములు ఆకాశమంత టయు వ్యాపించెను. దేవాలయములలో ఘంటలుమ్రోగింపబడెను. అభి షేకపూజోత్సవాదులు విశేషముగాచేయబడెను. వేదఘోషములు అం తటనువినవచ్చినవి. మామూలుగా జరుగుదినకృత్యములన్నిటిని అంద ఱును చేయదొడంగిరి. త్రిమూర్తులు మామునిశిరమున హస్తముంచి ఆశీర్వదించిరి. అప్పుడా మునివరుండు, సువర్ణకాంతితో సమానమగుదివ్య దేహము గలవాడాయెను. మన్మథునికన్న అతి మనోజ్ఞమగు యౌవన శరీరముగలిగి వెలిగెను. త్రిమూర్తులును, దేవతలును, వారి వారిస్థానము

నకు వెడలిరి. అత్రికుటుంబినియగు అనసూయయు భర్తయొక్క సమీపమునకు పోయెను. ఉగ్ర తపోముని శ్రేష్ఠుడగు మాముని యు, పుణ్యవతియగు శీలావతియు, బహుకాలము భూమిలో నివసించి యజ్ఞాది కర్మల జేయుచు యోగనిష్ఠాపరులై అంత్యకాలమున బ్రహ్మపదవిని పొందిరి. ఇట్టి పావన చరిత్రమును చదువువారికిని వినువారికిని మనుష్య జన్మములో గల ప్రతిబన్ధము లన్నియు తొలగి అంత్యకాలమున శాశ్వత పర బ్రహ్మప్రాప్తియు గలుగును. మాండవ్యముని యొక్క శాపమునకు భంగము గలుగకయు, శీలావతి తపోమహిమచే మాముని యొక్క మృత్యువు తప్పిపోవుటయు, సూర్యుడుదయించుటయు గలిగెను. ఇది యే మహిమవల్ల గలిగినదని విజ్ఞానవంతులు యోచించు కొనవలయు. ఆచరణ యొక్కయు, వ్రతముయొక్కయు, మహిమవల్లనే గల్గెను. త్రిమూర్తులకు సహా సాధ్యముకాని కార్యమును, వ్రత నిష్ఠగలవారు చేయగలరు. ఇదియే ఆచరణలో గల మహిమయని గ్రహించుకొన వలయును. ఈ సత్యమును తెలిసికొనజాలకనే కొందఱు ప్రారబ్ధ కర్మ మని చెప్పుచు ఎన్నియో చెడు కార్యములను జేయుచున్నారు. అందు వల్లనే బ్రహ్మనిష్ఠులపై, గురువులపై, లోకములో విశ్వాసము క్షయిం చడమైనది. అందుచే బ్రహ్మవిద్య సహితము పతనమొందెను. జిజ్ఞాసువులకు, ముముక్షువులకు, అభ్యాసులకు, సాధకులకు, ప్రారబ్ధ కర్మ ముండును. ఏలననగా వారు కర్మవిముక్తి కొఱకు ప్రవర్తించు వారలు. సర్వకర్మలు నశించునప్పుడే ముక్తాత్ముడగును. మరల జీవన్ముక్తునికి గూడ నికృష్టవర్తియగు ప్రారబ్ధ కర్మముండుటచే అటుల నిందిత మార్గములో ప్రవర్తించు చున్నారని చెప్పుట తప్పు. కర్మ నిర్ముక్తి కానిదో, ఎట్లు ముక్తుడగును? వృత్తులు, గుణములు, వాసనలు, సంస్కారములు, కర్మలు నశించుపర్యన్తము మనస్సేదైన నిందిత మార్గములో ప్రవర్తించిన, తనలో గల చెడు సంస్కారములు యికను నశించ లేదని తలంచి పతనము గలుగునప్పుడెల్ల పశ్చాత్తాపపడి దైవప్రార్థనచేసి ప్రాయశ్చిత్తము స్వయముగా జేయుచుండ వలయును. అట్లైనమాత్రమే పాప సంస్కారము లన్నియు నశించి శుద్ధాత్ముడగును. అయితే జ్ఞానికి గూడ ప్రారబ్ధకర్మ మనుభవించియే తీరవలయునని శాస్త్ర వాక్యములో

గల రహస్యము మాండవ్యమహామునియొక్క చరిత్రముచే తెలియ నగును. అట్టి పావనమగుచరిత్రమును సంగ్రహముగా క్రిందనిరూపించెద.

ఓమ్.

---

# మాండవ్య మహాముని చరిత్రము.

## శ్రీమదాంధ్రమహాభారతము — ఆదిపర్వము.

వ॥ అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

ఆ-గీ॥ సకలజీవరాశి సుకృతదుష్కృతఫల।
మెఱిగినడపుచున్న యట్టి ధర్ము।
డింను శూద్రయోనియందు మాండవ్యుచే।
శప్తుఁడై యదేల సంభవించె॥

వ॥ అని యడిగినవానికి వైశంపాయనుండిట్లని చెప్పె.

మాండవ్యుండను బ్రహ్మర్షి తొల్లి మహీవలయంబునంగల తీర్థంబులెల్ల నేకచారియై సేవించి, యొక్కనగరంబున కెడ గలుగునడవిలో నాశ్రమం బుసేవించి తద్ద్వారవృక్షమూలంబున నూర్ధ్వబాహుండై మౌనవ్రతంబు నం దపంబుగాయుచున్న నన్నగరంబున రాజు నర్థంబు ముచ్చిలి కొని పోవుచో, నాముచ్చులా రెకులచేత, ననుధావ్యమానులై మామాండవ్య సమీపంబునంబాఱి, యయ్యాశ్రమంబులోడాగిన, వారి వెనుదగిలి వచ్చిన యారెకులమ్మునింగని రాజు ధనాపహారులైనచోరులు నీయొద్దనపాఱి రెట బోయి రెఱుంగుదేని చెప్పుమనిన, నమ్ముని మౌనవ్రతుఁడు గావున బలుక కున్న, నయ్యాశ్రమంబులో జొచ్చి వెదకి ధనంబుతోడన, నాముచ్చులం బట్టికొని

ఆ-గీ॥ తానుచోరులకును దాపికాఁడై వేష
ధారిమిన్న కేని తపముసేయు।
చున్నయట్టు పలుకకున్నవాడనియొగ్గుబాడి।
యారెకులు నయంబులేక॥

వ॥ మాండవ్యునాశ్రమమ్మునచ్చోరులతోడంబట్టుకొని వచ్చి యారాజున కుంజూపి ధనంబొప్పించిన రాజు నాశ్రమమ్మునచ్చోరులంజంపించి తపోవేషంబున నున్న శ్రమ మ్మునని, యమ్మాండవ్యుని బురంబువెలుపల శూలప్రాప్తిం జేయించిన.

క॥ మునివరుడట్లుండియు దన
మనమున నతిశాంతుండై సమత్వమున దపం
మొనరించె ననశనుండ।
య్యును బహుకాలంబు ప్రాణయుక్తుండగుచున్॥

వ॥ ఇట్లుశరీరదుఃఖంబు దలఁపక తపంబుసేయుచున్న యమ్ముని తపంబునకుమెచ్చి మహర్షులుపక్షులై రాత్రివచ్చి, మునీంద్రా! యిట్టి మహాతపస్వివైన నీకు దుఃఖంబుగావించిన వారెవ్వరని యడిగిన వారికి నమ్మాండవ్యుండిట్లనియె.

తే-గీ॥ ఎఱిగియెఱిగి నన్నడుగంగనేల దీని
సుఖముదుఃఖంబుప్రాప్తించు చోట నరుఁడు।
దగిలి తనకర్మవశమున దనకుదాన।
కర్తగా కన్యులకు నేమికారణంబు॥

వ॥ అని యమ్మహామునులతో మాండవ్యుండు పలికినపలుకుల నన్నగరరక్షకులు విని వచ్చి యారాజునకెఱిగించిన, రాజునుంబఱ తెంచి శూలప్రాప్తుండై యున్న మాండవ్యునకు నమస్కరించి, నాచేసిన యజ్ఞానంబుసహించి నాకుంబ్రసాదింపవలయునని శూలంబువలన నమ్మునిం బాచుచోనది పుచ్చరాకున్నదాని మొదలు మెత్తనతనియించిన దత్కంఠ పార్శ్వంబునందు శూలశేషం బంతర్గతంబై యుండెదానంజేసి యామునియణిమాండవ్యుండునాబరగె, అమ్మహాముని ఘోరతపంబుచేసి యెల్లలోకంబులుజరియించి యొక్కనాడు, యమునిపురంబునకరిగి ధర్మరాజునకిట్లనియె.

క॥ దండధర యిట్టి దారుణ
దండమునకు నేమి దుష్కృతము జేసితి ను।
గ్రుండవయ్యు తగనిదండము।
దండింపక బ్రాహ్మణుండ దగునేనన్నున్॥

వ॥ అనిన మాండవ్యునకు ధర్మరాజిట్లనియె.

క॥ పాలయుక తూనిగలం గొ
ఱ్ఱులఁ జెట్టితి నీవు నీచిఱుతకాలము ద
త్ఫలమిప్పు డనుభవింపక।
తొలఁగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్॥

వ॥ అనిన మాండవ్యుండలిగి జన్మంబు మొదలుగాఁ బదునాలుగు వత్సరములు దాటునంతకు బురుషుఁడు బాలుండు వాఁడెద్ది చేసిన, బాపంబులం బెద్దపారయఁడు వానికి నొరులెగ్గు సేసిన పాతకులగుదురిది నాచేసిన మర్యాద నీవిట్టి ధర్మంబు దలఁపగ బాలంబున నల్పదోషంబున జేసిన నాకు బ్రాహ్మణోచితంబుగానె క్రూరదండంబుగావించినవాఁడవు, మర్త్యంబున శూద్రయోనిం బుట్టుమని శాపంబిచ్చుటం జేసి వాఁడు విదురుండై పుట్టె.

క॥ అని మాండవ్యాఖ్యానము
జనమేజయునకును దానచరితునకు బ్రియం।
బున జెప్పెను వైశంపాయనుడవితథ।
పుణ్యవచనుడని కడుభక్తి॥

జనులారా! ప్రారబ్ధకర్మము యీలాగున జ్ఞానులకు గలుగునేగాని వివేకశూన్యులై చెడువృత్తిలో ప్రవేశించుట ప్రారబ్ధమని తలంచనలదు. అది అవివేకజన్యమేయగును. అట్లుకానిచో పామరులు జరిపెడు పాప కర్మలుగూడ ప్రారబ్ధమనితలంచి, రాజులు వారినిరక్షింపందగునె? ఏపాపము నెఱుంగని దేవత మొనరించుచు మౌననిష్ఠతోయుండునా మునిసత్తమున కప్రయత్నముగ తటస్థించిన శిక్షవంటిదే ప్రారబ్ధమగును. అనగా జ్ఞానులకు గలిగెడు రోగారోగ్యములు, స్తుతినిందలు, పూజ్యాపూజ్యతలు సుఖదుఃఖములు మొదలైనవి ప్రారబ్ధమగును. ఈక్రిందిప్రమాణముం జూడుడు.

శ్లో॥ వినాస్వయత్నం లోకే యే సుఖదుఃఖే చ యోగినాం।
ప్రారబ్ధం తద్విజానీయాన్నతు కర్మయుజాం ఫలమ్॥

తా॥ యోగులగువారికి యేప్రయత్నమునుజేయక లోకములో గలుగుచుండు యే సుఖదుఃఖములు గలుగునో, అదియే ప్రారబ్ధమని తెలియందగినది. అట్లుగాక స్వప్రయత్నపరులై విషయములలో ప్రవర్తించెడు

వారికి కలిగెడు సుఖదుఃఖములు ప్రారబ్ధములని చెప్పరాదు. అది ఆత్మశుద్ధిలేక కలిగెడు దోషమేయగును. ప్రారబ్ధకర్మవాక్యమునకు అర్థాత బ్రహ్మజ్ఞానులకుమాత్రమే సిద్ధించును. తక్కినవారివి జన్మాంతరకర్మ విశేషముచే గలుగునట్టి ప్రారబ్ధమైనను, వారు కర్తృత్వబుద్ధిగలవారగుట చేతను, విధినిషేధముల తెలిసికొని ప్రవర్తించువారై యుండవలసిన వారగుటచేత ప్రారబ్ధమనందగదు. ప్రారబ్ధమనిన విధినిషేధముల తెలిపెడు వేదమునకే అర్థమే లేకపోవును. అదియునుగాక గురుశిష్యసాంప్రదాయమున్ను చెడును. కావున రోగియైనవాఁడు ఆరోగ్యసిద్ధిగలుగువరకు, ఔషధసేవ; పథ్యములతో యుండవలసినట్లు ఎంతవఱకు అంతఃకరణ శుద్ధిగల్గి నిర్విషయస్థితిని పొందలేదో, అంతవరకు యేదైనపొరబాటు గలిగినచో, పశ్చాత్తాపప్రాయశ్చిత్తాదులచే శుద్ధుఁడయ్యేలాగున చూడవలయును. ఇదియే శాస్త్రమర్యాద. అట్లుగానిచో, ప్రాయశ్చిత్తవిధులన్నియు నిష్ప్రయోజనములుగావా?

శ్లో॥ యావత్సుఖంచ దుఃఖంచ బాధా పుణ్యేన పాపతః।
సుఖదుఃఖవిహీనస్తు పుణ్యైః పాపైర్న బాధ్యతే॥

తా॥ సాధకునకుగాని, ముముక్షువునకుగాని, యెంతకాలమువరకు పుణ్యముచే గల్గెడు సుఖముగాని, పాపముచేగలిగెడు దుఃఖముగాని ప్రతీతములగునో, అంతవరకు, అతఁడు పాపకర్మములచేయక పుణ్యకర్మములనే చేయవలయును. ఎప్పుడు సుఖదుఃఖములు రెండున్ను సమానబుద్ధితో చూచే స్థితిగల్గునో అట్టితరి పుణ్యపాపములచే విడుదలపొందినవాఁడగును. అనగా ఎంతకాలమువరకు పుణ్యకర్మఫలమగు సుఖము గలుగవలయునని అభిలాషయు, పాపకర్మచే గలిగెడుదుఃఖము గలుగకూడదని తలంపున్ను గల్గియుండునో, అంతకాలమువఱకు విధినిషేధముల అనుసరించియే ప్రవర్తించవలయును.

శ్లో॥ విషబీజం భువి న్యస్య కథం స్వాదు ఫలం వ్రజేత్।
బీజం రుహ్యోత్తథా పుష్పేత్ఫలేదిత్యవదచ్ఛ్రుతిః॥

తా॥ విషవిత్తనమును భూమిలోవిత్తి, అమృతఫలమును అభిలషించిన ఎట్లు సిద్ధించును? విష బీజమునకు విషఫలము, అమృత బీజ

మునకు అమృత ఫలము మాత్రమే గలుగునని, వేదమాత పిల్లలకు తల్లి వలె యుపదేశించుచున్నది. బీజ మెట్టిదో అట్టి అంకురమే గల్గును. దానికి అనుగుణమగు పుష్పమే యేర్పడును. దానికి సంబంధించిన ఫలమే యుద్భవించును. ఇదియే వేదసమ్మతము. దీనికన్న పరమప్రమాణమేది గలదు? కావున వి త్తనము విత్తుటకు ముందుగానే ఫలము నాలోచించి చేయవలయును. విషబీజమును వి త్తి అమృతఫలమును పండించ శక్తి గలవారెవరైన యుండినచో, వారికి దుష్కర్మమైనను జ్ఞానము గలుగ జేయును. అట్టివారు లోకములో ఎంతమందియున్నారో విజ్ఞులే నిశ్చయించుకొనవలయును.

శ్లో॥ త్యక్త్వా ఛాయాం వినిర్గంతుం నహి శక్నోతి మానవః।
సహితశ్చేత్సహితశ్చ ఇతి వేదానుశాసనమ్॥

తా॥ మానవుఁడు నడచునప్పుడు తననీడను తననుండి తొలగించి నడచుటకు ఎట్లు శక్తుఁడుగాఁడో, ఛాయ తనతోగూడ వచ్చుచుండిన తనకర్మముగూడ తనను విడవక ఎల్లప్పుడును యెచ్చోటను తనతో గూడి యుంటున్నట్లు నిశ్చయించుకొనవలయును. ఇది వేదశాసనము. నీడను దూరముగాత్యజించి నడవశక్తిగలవాఁడై యుండినేని, తానుజేసిన కర్మఫలము తనను అంటదని తెలిసికొనందగును. వేమన యోగీశ్వరుఁడు తనచేతితోయిచ్చిన కూలివారి పెట్టి పుచ్చకాయలోపల రత్నము లుండినవట. యాభై సంవత్సరముల క్రింద జీవించియుఁడిన వడలూరు రామలింగస్వామి నడచునప్పుడు నీడలేదని చూఁచిన భక్తులనేకులు గలరు. వారు ఇష్టపడి ఫోటోతీసిన ప్రతిబింబముండును. మహానిరభిమానియు, వైరాగ్యనిధియు అగుటవల్ల తనకు ఫోటో తీయించుట ఇష్టముండదు. అట్టి తరుణమున ఎవరు ఫోటోతీసినను ఛాయ, అనగా ప్రతిబింబము పడుటలేదని అనేకభక్తులు ఇప్పుడుకూడ చెప్పుచుందురు. కర్మరహస్యమీలాగున యుండునని విజ్ఞులుగ్రహించి ప్రవర్తించిన పరమశాంతిని ఁడయగలడు.

శ్లో॥ పృథివ్యాం బీజవత్పుంసి తిష్ఠత్యేవ శుభాశుభం
ఆబ్రహ్మణః పరిజ్ఞానాత్ సంతరత్యేవ నోతతః

తా॥ భూమిలో మంచి, చెడు, విత్తనములవలె మానవుల హృదయమందు, పుణ్యపాపసంబంధ సంస్కార బీజములుండును. బ్రహ్మజ్ఞాన పరిశోధనవల్లనే, జీవకోట్లు తరించవలయును. వేరుమార్గము లేదు. అనగా ఎండకాలమున భూమిలో తృణబీజములు కనుపించక పోయినను వానపడునప్పుడు ఏలాగున అంకురించునో, యే యే బీజము లుంటున్నవో, అవి ఆలాగున మొలకెత్తి వృక్షములై పుష్పపల్లవ ములతోకూడి ఫలమునిచ్చును. భూమియందులేని బీజ మొకటైనను మొలవదు. ఆలాగున హృదయమునుండి పుణ్యముగాని, పాపముగాని, యేగుణము గల్గుచుండునో, తదనుగుణమగు సంస్కారము తనయందు యున్నట్లు తెలిసికొనవలయును. విత్తనములేని భూమిలో యే చెట్లు గాని తృణముగాని పుట్టనట్లు: సంస్కారము నశించిన హృదయమున యే గుణమును కలుగదు. ఇదియే దానికి గుఱుతు. నిప్పులోవేయించిన విత్తనములు యేలాగున అంకురించవో, అలాగున జ్ఞానాగ్నియందు దగ్ధమైన సంస్కారము గలుగునప్పుడు ప్రాకృత గుణములేమియు యుద్భవించవు. ఇదే దీనిలోగల రహస్యము. అట్టి స్థితి బ్రహ్మజ్ఞానము వలననే గలుగును. ఏలన బ్రహ్మము ప్రకృతిరహితమైనది. శుద్ధమైనది. జ్ఞానమైనది. దానినుండి ప్రాకృతగుణములు జనింపవు.

శ్లో॥ మణిమన్త్రౌషధై ర్వహ్నిస్సుదీప్తోఽపి యథేన్ధనం।
ప్రదగ్ధుం నైవ శక్తస్స్యాత్ప్రతిబద్ధస్తథైవచ॥
శ్లో॥ జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తస్సుదృఢోఽపిచ॥
ప్రదగ్ధుంనైవ శక్తస్స్యాత్ప్రతిబద్ధస్తు కల్మషమ్॥

తా॥ మండుచుండెడి అగ్నిని, మణిమంత్రౌషధములచే కట్టుగట్టి నప్పుడు ఎటుల దహనశక్తి లేకుండపోవునో, ఆలాగున జ్ఞానాగ్నిప్రకాశించి దృఢముగా యుండినను విషయ వృత్తులుండినవో కర్మబీజములను దహించుటకు శక్తియుండదు. అనగా విషయవాసన అంత చెడ్డదని పరాశరమతము. ఈ సంగతి యిప్పుడు రాజయోగులమని చెప్పువారు బాగుగ యోచించుకొనవలయును. ఇదేప్రకారము ఇంద్రజాలకుఁడు వెలుగింపజేసెడు అగ్నిజ్వాలగూడ ఒక్క శుష్క తృణమునైన భస్మ మొనరింపజాలనటుల, వేదాంత శాస్త్రమందు ప్రవీణుడై బోధనాశక్తి

గలిగియుండినను నిర్వ్యాపనస్థితి పొందనిచో అతని సంస్కార బీజములు భస్మములుకావు. అందువల్ల మరల జన్మాదిక్లేశమును పొందవలసి యుండును.

శ్లో॥ తావదేవ నిరోద్ధవ్యం యావద్వృత్తి గతం క్షయమ్।
ఏతజ్జ్ఞానంచ ధ్యానంచ శేషోఽన్యో గ్రంథవిస్తరః॥

తా॥ ఎంతవరకు వృత్తి రాహిత్యము గలుగలేదో, అంతవరకును బ్రహ్మానుసంధానమగు ధ్యానయోగమును, వేదాంతశ్రవణ జ్ఞానమునున్ను విడువరాదు ధ్యాన యోగముయొక్కయు, జ్ఞాన యోగముయొక్కయు పరమకాష్ఠయిదియని గ్రహింపనగును. గురువాక్యముచేతను, ఇతర శాస్త్రముల చేతను, తన యనుభవము చేతను తెలిసికొనందగిన విషయమిది యొకటియే. విస్తారముగా ప్రపంచములోగల శాస్త్రములన్నిటియొక్క సారమిదియే.

శ్లో॥ స్వచ్ఛంద భైక్షముపపన్న మఠాధివాసః
సత్సంగతిర్విషయ సంగనివర్తితాచ।
వేదాంతవాక్యమననం శ్రవణం పరాత్మ
ధ్యానంచ భాగ్యవశతో యతయో లభన్తే॥

తా॥ (1) ప్రతిబంధములేని భిక్షాన్నము (2) అనుకూలమఠ నివాసము (3) సత్పురుషుల సహవాసము (4) దృశ్య విషయములలో విరక్తియు (5) వేదాంతవాక్య శ్రవణము (6) దానియొక్కమననము (7) పరమాత్మధ్యానము, ఇవిగొప్ప భాగ్యముగల యతులకుమాత్రమే లభించును. అన్నమునకు కష్టములేకయు, నిర్మలవిజన ప్రదేశము, బ్రహ్మనిష్ఠుల సహవాసము, శబ్దాదివిషయములనుండి చిత్తముపరతినినొందుట, వేదాంతవాక్య శ్రవణము, దాని మననము, నిదిధ్యాసమగు పరమాత్మ ధ్యానమున్ను పుణ్యజీవులకుమాత్రమే గల్గును. పుణ్యములో కొరతగల వారికి ఈ ఏడింటిలో యేదైననొక్కటి కొఱతపడును. ఈ ఏడున్ను కలిసినమాత్రమే నిర్విఘ్నముగ బ్రహ్మనిష్ఠకనుకూలపడును.

## దశగ్రీవుండు శివునినుతించి యతనివలన వరముల బడయుట.

ధర్మములయొక్క రహస్యము ఈ రావణేశ్వరుని కథచే విజ్ఞులు తెలిసికొనవచ్చును. శ్రీమద్రామాయణ ఉత్తరకాండమున ఈ గాథ గలదు ఎంత తపోధనుడైనను, యోగసిద్ధిని పొందినవాడైనను, ఈశ్వర సాక్షాత్కారముగల భక్తుడైనను, ధర్మానుష్ఠానము యుండు మాత్రము వరకే ఆమహిమలు ఈశ్వర దత్తవరములు, మొదలయినవన్నియు నిలుచును. ఎప్పుడు ధర్మమునుండి పతితుడగునో, సరోవరములో నివసించెడు పక్షులు జలము నశించిన వెంటనే ఆస్థానమునుండి ఎట్టుల వెళ్ళిపోవునో ఆలాగున, పైజెప్పిన మహిమలన్నియు ఇతనిని విడచి వెడలును. ఆకథయే దీనియందు నిరూపింపబడును. ఇచ్చట ఇది సంక్షిప్తముగా యుండును.

తే॥ పలికిరవధారు దైతేయ పట్టభద్ర
భద్ర గజచర్మధారిపై భక్తియుంచి
యంచితోక్తులయతని నుతించితేని
నీనిరోధంబు నెడబాపు నీక్షణమున

క॥ హరుఁడున్నత కరుణానిధి
శరణన్న బరిగ్రహించు జగతినతనికిన్
బురుడున్నడె యజకనకాం
బరు లెన్నగలేరుతత్ప్రభావంబనినన్.

శా॥ ఆపన్నుండగు పంక్తికంఠుడిది యానంచున్ లలాటేక్షణ
శ్రీపాదాంబుజముల్ మనోజంబుమునన్ జింతిపుచున్ వేద వి
ద్యాపాండిత్యము సర్వశాస్త్ర కుశలత్వంబున్ మహాసాహితీ
నైపుణ్యంబును గానుపింప బాగడెన్ గంగోర్మితుంగార్భటిన్.

శా॥ ఆస్తోత్రంబున కామనోద్రథిను కాధ్యావాప్తికా ఈశ్వరుం
డస్తోక ప్రియ మానహించి పెనువ్రేలావేళఁ బైనెత్తినన్
హస్తంబుల్ వెడలంగ బాపికొని దైత్యస్వామి ఫాలస్థల
న్యస్తప్రాంజలియై నుతింపదొడగెన్ గంభీరవాగ్గుంభనన్.

చ॥ అనితనుఁ బ్రస్తుతించిన దశాననుఁ జూచి పురారినవ్వుచున్
దనుజవరేణ్య నీస్తుతికి డద్దయునెచ్చితి ధైర్యశాలివో,

దనుమతి యిచ్చితిన్ జనుప్రియంబగు చోటికి నీభుజాబలం
బనితరసాధ్యమంచు విని యారయనిల్పితి నింతెయియ్యెడన్.

ఉ॥ ఆదశకంఠుఁ డీశ్వరున కానతుఁడై శివనన్నుఁబ్రోవ నా
హ్లాదముగల్గి నేని నిసుమంత కొఅంతయు లేని యాయువున్
నీదగు చంద్రహాసమును నెమ్మినొసంగు మటన్న శంభుడ
కైకొదువునిచ్చి పిమ్మట నఖండతరాయువునిచ్చి యిట్లనున్.

మ॥ దితిజాధీశ్వర నీవు గోరినక్రియన్ దీర్ఘాయువున్ నీకు ని
చ్చితి నీక్రొవ్వున నీతిజేకొనక దుశ్శీలుండవై మమ్మునా
దృతి నొందించితి వేని మావరము మమ్మేచేరుఁ బొమ్మన్న బో
నతడాశూలికి మ్రొక్కి వీడ్కొని విమానారూఢుడై యుబ్బుచున్.

క॥ తనపరివారము గొల్వఁగఁ,
జనియెన్ రజతాద్రి డిగ్గిస్వచ్ఛందగతిన్
మనుజేశ్వర యని కుంభజుఁ,
డినకులునకుఁ దెల్పి మఱియు నిట్లని పలికెన్.

దీనిపై జెప్పిన పద్యముయొక్క సారమును మనము గ్రహించు కొనిన చాలును. బ్రహ్మదేవునివల్ల, ఈశ్వరునివల్ల, ఎన్నియో వరముల రావణుడు పొందినను, వర్తనము చెడినందుచే ఎటులనశించెనో, జ్ఞాపక ముంచతగినది. కావుననే పరమశివుండు "దితిజాధీశ్వర నీవు గోరినక్రియన్ దీర్ఘాయువున్, నీకునిచ్చితి, నీక్రొవ్వున నీతిజేకొనక దుశ్శీలుండవై మమ్ము నాదృతి నొందించితి వేని మావరము మమ్మేజేరు" అని చెప్పెను. ఇదియే దీనిలోగల ప్రాణము. దీనికొఱకే ఇచ్చటిది వ్రాయడమైనది. హేమంతమువచ్చినవెంటనే సరోవరములోగల పద్మములన్నియు ఎటుల జీర్ణించిపోవునో, శిశిర ఋతువురాగానే వృక్షములన్నిటియొక్క పత్రములు ఎటుల రాలిపోవునో, ఆలాగున యోగముచేగాని, జ్ఞానముచేగాని, తపస్సుచేగాని, విద్యచేగాని ఎంత శోభాయమానుడై ప్రకాశించు చుండినను, అధర్మమందెప్పుడు ప్రవేశించునో, అప్పుడే యివన్నియు వాని నుండి వదలిపోవును. కావుననే శ్రీ జగద్గురు శంకరాచార్యులు ఇటు తెలుపుటకు కారణము.

శ్లో॥ యావజ్జీవం త్రయోవంద్యా వేదాంత గురురీశ్వరాః।
ఆదౌ విద్యాప్రసిద్ధ్యర్థం అన్తే విఘ్ననివృత్తయే॥

తా॥ జీవన్ముక్తుండైనను, తపస్సంపన్నుడైనను, యోగసిద్ధిగల వాడైనను, ఎంత కాలమువరకు జీవించియుండునో, అంతవరకు వేదాంత విచారణయు, దానియందు జెప్పిన యాచరణయు, గురుదేవుని యందును, ఈశ్వరుని యందును గల భక్తివిశ్వాసముల విడువరాదు. పై జెప్పిన మూడింటివలననే, ఆత్మజ్ఞానమువల్ల ప్రసిద్ధికి వచ్చినదనియు, అదియునుంగాక అన్త్యకాలమువరకు విఘ్ననివృత్తి గలుగుననియు, విజ్ఞులు తెలిసికొన వలయును.

శ్లో॥ విహితస్యాఽనుష్ఠానా న్నిషిద్ధస్య చ సేవనాత్।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి॥

తా॥ అనుష్ఠించవలసిన దానిని అనుష్ఠింపక పోవుటచేతను, నిషిద్ధ కార్యముల చేయుటచేతను, ఇంద్రియ నిగ్రహము లేకపోవుటచేతను ఎంత బ్రహ్మజ్ఞానముగల మనుజుడైనను పతితుడగును.

శ్లో॥ ఉచ్ఛాస్త్రం శాస్త్రితంచేతి ద్వివిధం పౌరుషంస్మృతం।
తత్రోచ్ఛాస్త్రమనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్॥

తా॥ పురుషప్రయత్నము అశాస్త్రీయమనియు, శాస్త్రీయ మనియు ఇరుతెగలు గలది. వానిలో అశాస్త్రీయము అనర్థహేతువ నియు, శాస్త్రీయము మోక్షహేతువనియు గ్రహించవలయు.

శ్లో॥ సుఖమిచ్ఛన్తి యేమూఢాః నేచ్ఛన్తి సుఖకారణం।
నేచ్ఛన్తి దుఃఖలేశంవా తద్ధేతో స్సతతంయుతాః॥

తా॥ వివేకశూన్యులగు జనులు సుఖమునే సర్వదాకోరుచుం దురు. అయితే సుఖమెటులగలుగునో దానియొక్క కారణమును మాత్రము విచారించరు. దుఃఖ లేశమైననుకోరరు. కాని, దుఃఖకారణ మగు పాపకర్మను సదాచేయుచుందురు. ఓహో, ఏమి ఆశ్చర్యము!

శ్లో॥ ధర్మోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణాం।
ధర్మే స్వకీయేఽనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః॥

తా॥ ధర్మోపదేశమును జనులకుచేయుటలో జనులందఱికిని చాలాసులభము. అలాగుననే తానుచెప్పినట్లు అనుష్ఠించెడు మహాత్ముఁడొకానొకఁడు మాత్రమేయుండును.

శ్లో॥ యథా భర్జితబీజస్య ప్రరోహత్వం వినశ్యతి।
తథాత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధి ర్విలీయతే॥

తా॥ ఏలాగున అగ్నియందు వేయింపబడిన విత్తనమునకు అంకురత్వము నశించునో, అలాగున ఆత్మజ్ఞానాగ్నియందు దహింపబడిన హృదయముగలవానికి ప్రకృతిగుణములుండవు.

శ్లో॥ జ్ఞానే మమోదితే భోగాః కింకుర్వ న్తీతి యే విదుః।
భోగేసంగం మతేర్భంగం జ్ఞాన శ్శైథిల్యమాప్నుయుః॥

తా॥ జ్ఞానముగలిగినపిమ్మట విషయభోగములలో ప్రవర్తించినచో, యేమి విరోధమని కొందరడుగుదురు. అలాగున భోగమందాసక్తిగలిగిన మతిచెడును. జ్ఞానముగూడ భిన్నాభిన్నములై పోవును.

శ్లో॥ రాగోలింగమబోధస్య చిత్త వ్యాయామభూమిషు।
కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః॥

తా॥ ఈశ్లోకముచే ముక్తునియొక్కయు, బద్ధునియొక్కయు భేదము తెలియందగును. ఆత్మబోధము గలుగనివానిచిత్తము, విషయభూమికలయందు సంచరించుచుండును. వృక్షకోటరాంతర్భాగమున అగ్నిరగులుచుండిన, దానియందేలాగున ఫలపల్లవ పుష్పములుండవో, అలాగున యెవనియొక్క హృదయాంతరాళములో జ్ఞానాగ్నిరగులుచుండునో అట్టివాని నేత్రముఖాది యింద్రియములన్నియు నిర్విషయములై యుండును. అదే దానికిగురుతు. అట్లుగాక పుష్పఫలపల్లవాదులతో శోభించుచుండిన ఆ మ్రానుతొఱ్ఱయందు నిప్పు రగులుటలేదని తెలిసికొనునటుల ఎవనికి యింద్రియవిషయ వికాసస్వభావము గలిగియుండునో, ఆతనిహృదయమున జ్ఞానములేదని గ్రహించుకొనేది.

ఓమ్

# శ్రీసీతాదేవి అగ్నిప్రవేశమును జేయుట.

మానవులారా! శీలవ్రతముయొక్క మహిమాతిశయము శ్రీ సీతాదేవి యగ్నిప్రవేశముచే తెలిసికొనవచ్చును. ఇదిమంత్రజపము చేతగాని, యోగాభ్యాసముచేతగాని, తపస్సుచేగాని, శాస్త్ర పఠనముచే గాని గల్గిన దివ్యత్వముగాదు. తనయొక్క పవిత్రవర్తనముచే గల్గిన మహిమయని ఎఱుంగుడు. దీనిసిగురించి ఆలోచించిన తనపవిత్రవర్తనమునకు మించినమహిమ మఱియొకటిలేదని తెలిసికొనవచ్చును. కావుననే మహామంత్రములకు మించినమహిమ పవిత్రమగు అనుష్ఠానమందుగలదని తెల్పుటకు కారణమైనది. సీతాదేవియందు మనోవాక్కాయ కర్మల యందు యేదైన కించుత్తు గూడ మాలిన్యము యుండిన అగ్నిదేవుని అట్లు ప్రార్థింపగల్గునా? ప్రార్థించినను ఫలించునా? ఎవరెవరిని సాక్షిగా నిరూపించెనో, అవన్నియు క్రిందవ్రాయబడు భాస్కరరామాయణము వలన మీరే తెలిసికొనగలరు. కావున మీకు హృదయములో సీతాదేవికి గల్గినటుల దృఢవిశ్వాసము గలిగియుండవలసి యుండినచో, మీ పవిత్రవర్తనమే యుండవలయును. కావున యే విపత్కాలమందు గాని, కట్టకడకు దేహప్రయాణకాలమందుగాని, మోక్షవిషయమైగాని, జీవితమంతయు చారిత్రసిద్ధి గలిగియుండవలయు, లేనిచో, దైవప్రాప్తి విషయములో సహితము మీకు దృఢవిశ్వాసము యుండదు. అంత్య కాలమున అట్టిదృఢభావము గలుగనిచో, కొంచమైనను మనోవికల్పము గలిగిన, గురితప్పిన బాణమువలె బ్రహ్మపదమును పొందజాలరు. ఒక వేళ అజ్ఞానదశలో యేదైన మనోమాలిన్యము గల్గియుండినచో, జ్ఞానారంభ కాలములోనే ప్రాయశ్చిత్తమును జేసికొని పశ్చాత్తాపపడి సర్వేశ్వరుని క్షమాపణ కోరవలయును. తరువాత మనోవాక్కాయ కర్మలయందు ఏలాటిమాలిన్యమును గలుగనీయక ఋజుమార్గముగ జీవితమును గడుపవలయును. అట్లుపావన జీవితము గడుపనివారి జప,ధ్యాన, యోగ,విద్య, తపస్సులన్నియు విషముగలిసిన క్షీరాన్నభాండమువలె యుండును. ఎంత గొప్పపాత్రములో ఎంతరుచికరములగు వస్తువులచే చేయబడిన పర

మాన్నమైనను ఒకబిందుప్రమాణవిషము పడిన యేలాగున నిరుప యోగములై అపాయకరములై పోవునో, పైజెప్పిన యోగాధ్యనుష్ఠానములన్నియు యుండినను విషయదోషముండిన అపాయమునేగలిగించును.

శ్లో॥ ఊషరే వాపితం బీజం భిన్నభాండేచ గోదుహాం।
భస్మనీవ హుతం హవ్యం మూర్ఖే దానమశాశ్వతమ్॥

తా॥ చౌడుభూమిలో విత్తిన విత్తనమును, రంధ్రముగల భాండములోనుంచిన క్షీరమును, బూడిదయందు హోమించిన హవిస్సును ఎట్లు వ్యర్థములో, ఆలాగున పవిత్రమగు అనుష్ఠానములేనివాని యోగధ్యానాదులన్నియు వ్యర్థములు. అట్టివానికుపదేశించిన మంత్రము ఇచ్చిన దానముగూడ నిష్ప్రయోజనములు.

ఉ॥ లక్ష్మణచూచితే యనఘలక్షణ లక్షితనైన నన్ను దు
ర్లక్ష్మచరిత్రుఁ బోలె వికలస్థితిగా భవదగ్రజుండుదా
సూక్ష్మనిశాతమైనమతిఁ జూడక ఘోరవచో మహాగరు
త్పక్ష్మవితీక్షణాస్త్రములఁ బాల్పడఁజేయుచునున్నవాఁడొగిన్.

సీ॥ పరవృత్తచేష్టిత భావేంగితంబులు
సూచితెలియు దీవుశుద్ధచరిత।
యౌదార్య గంభీరతౌన్నత్య ధైర్యాది
గుణముల నెంతయుఁగొమరు మిగిలి।
యాగమలౌకిక వ్యవహారములయందు
నరయ నీవెఱుగని యదియుఁ గలదె।
ననునీవు చిగుఁజిన్ననాఁట నుండియుఁజూచు
చుండుదు విటయోగ్యులున్నవయ్య।

తే॥ యోగిమహీపతి యప్పటినుండి పలుకు
ననుచితంబులు మాన్పంగ ననువులేదె।
పరుషదుశ్శ్రవిభీషణ భాషణములు
నీవుదయమాలి విననెట్లు నేర్చితయ్య।

క॥ మీరింతనమ్మకున్నను గారవమే పారనన్నుఁగరుణించి మహో
దారంబగు సొదఁబెట్టుఁడు ధీరమతిం జొత్తునందుఁ దిరమగుకడఁకన్

చ॥ కలఁగక జాతవేదసుఖంబున నెంతయుశుద్ధురాలనై
నలువయు శూలియుం హరియునన్ను వెసంగొనియాడునట్లుగాఁ
జాలవక మీరుమెచ్చ గతిఁజొచ్చెదఁ జిచ్చు మదీయభర్తక
న్నెలవగునంత మీఁద శుభశీలత ధారుణి నాశ్రయించెదన్.

మ॥ అనినందల్లడమంది లక్ష్మణుఁడు దైన్యాయత్తచేతస్కుఁడై
తనలోనం దలపోసి ఖేద మొదవన్ ధాత్రీపతింజూచి య
జ్జనపాలాగ్రణి సన్నచేసిన నుదంచద్వేగమేపార నే
చినమంటల్ మొగిమిన్నుముట్టసొదపేర్చెన్ సీతమోదింపగాన్.

తే॥ పరమపావనియగు సీత పరఁగనేఁడు
చెలఁగి నాయందుఁ జొచ్చుటఁజేసి మిగుల
ననఘశీలుండనయ్యెదనని ము
దంబుఁ బొందుకైవడి మిన్నంది పొదలెనగ్ని.

వ॥ తదనంతరంబ

క॥ తలవాంచి యున్నభాస్కరకుల పతికిఁబ్రదక్షిణించి గురుతరకీలా
కులమగు సొదచేరంగా సలలిత గతినేగుదెంచి జానకి యంతన్.

చ॥ వినయముతోడ మ్రొక్కి యరవింద నిభానన వేడ్కవీతిహో
త్రునకుఁబ్రదక్షిణంబు సనుదెంచి కృతాంజలియై త్రిలో
కపావనగత సర్వభావన నివారిత కల్మష సర్వనిర్జరా
నన సకల క్రియాధికరణ ప్రవణాభినివేశ పావకా।

చ॥ స్థిరమతులార యో సకలదిక్పతులార సురేన్ద్రులార కి
న్నరవరులార సర్పకుల నాయకులార మునీన్ద్రులార ఖే
చరవరులార యక్షగణచారణ గుహ్యకసాధ్యులార వి
స్ఫురదినచంద్రులార వరభూతములార యెఱింగి యుండుఁడా

క॥ మీరిందఱుఁ దగుగుఱిగాఁగోరుచు నేనున్నదాన గురుహితమతినా
చారిత్రంజేచందంబేరూపము దానిమీర లెఱుఁగుదు రరయన్.

వ॥ కావున వాఙ్మనఃకాయ కర్మబుద్ధీంద్రియ తదర్థంబులంజేసి నిమేషకాష్ఠా కళాక్షణ ముహూర్తయామ సంధ్యాహోరాత్ర పక్షమాసర్త్వయన వత్సర పరిగణితంబులగు కాలంబులు నాఁటిగా స్వప్నాద్య

వస్త్రలయందును, జ్ఞానాజ్ఞానంబుల యందును, మద్వల్లభుండగు రఘు
నాథునకుం దప్పుటలేదు.

క॥ చాయగతి నాదుచిత్తము పాయక
రఘునాథునంద పరఁగునయేనిన్
న్యాయముదప్పక దహనుఁడుధీ యుక్తిన్
నన్నుఁగాచు ధృతిమెయిఁ గూడన్.

తే॥ దుష్టకల్మష బుద్ధినై దోషమునను
జనకులాధీశునకుఁ దప్పి సచ్చరిత్ర
మెడలి నడుచుట గలిగిన నీక్షణంబ
చెలగినను నగ్ని భస్మంబు సేయుగాత.

మ॥ అనుచున్ నిశ్చలచిత్తయై రఘుకులేంద్రాయత్త చింతావశం
బునఁ దాత్పర్యముగల్గి నిర్మల లసద్బుద్ధి ప్రసాదంబు పెం
పున నభ్రంకషకీలుఁడై కనలుచున్ భూరిప్రభుండైన య
య్యనలుండుప్పతిలంగఁజొచ్చె నిరపాయ స్నేహారాంగబునన్.

ఆ॥ అనఘమంత్రపూతమైనయాజ్యాహుతి, పగిదిధరణిపుత్ర, పడియెనంత
దేజమెసఁగ నగ్ని దేవుండు మిన్నందిమహితశిఖలు గలిగిమండజొచ్చె.

ఉ॥ లోలవిలాస ఖేలన విలోచన మీనము లాననాబ్జమున్
లాలిత బాహువల్లరి మృణాళములుం బృథుకేశభార శై
వాలము నొప్ప సీత యనవద్య పవిత్ర చరిత్ర విస్ఫురచ్ఛ్వల
కృశానునందు సరసీగతిఁ జూడక నొప్పెనెంతయున్.

చ॥ పవడపురాశిలోని నవభర్మశలాకయుబోలె జారు ప
ల్లవముల కుప్పలోని దినలాలిత చంపక దామమట్లు ర
క్తవనజరాజహంసియనఁగా నరుణాభ్రములోన నున్న యా
నవశశిరేఖఁ బోలె దహనస్థితయయ్యె విదేహకన్యదాన్.

వ॥ అప్పుడు పతివ్రతాశిరోమణి యగుసీత, దహన శిఖావృతయై యున్నం గనుంగొని దానవాంగనలు శోకింప, నిశాచరులు దుఃఖింపఁ, గపులు సమాక్రందనంబులు సేయ, సుగ్రీవుండు బెగ్గిల, విభీషణుండు పారవశ్యంబు నొంద, నంగదుండు విన్నఁదనంబు సెంద, హనుమంతుండు ఖేదింప, లక్ష్మణుండు వగలంబొగుల, రాఘవుండవా

జ్ఞుఖుండై నిర్వేదింప, సురు లనుచితంబన, సాధ్యులన్యాయంబన, యక్షుల నుపేక్షణీయంబన, గంధర్వు లద్భుతంబన, మహోరగంబులు తగదన, జరాచరంబులు దృశ్యాదృశ్యంబును నగు భూతంబులు దల్లడిల్ల, మహాభూతంబు లాక్రోశింప సక్కోలాహలంబు లొక్కపెట్టనొదవిన.

సీ॥ ప్రమథులుసను దేర బాలేందుధరుడైన
మూడుగన్నుల వేల్పు మున్నుగాఁగ
జగముల సృజియింపఁ జాలి యాద్యుండైన
చతురాస్యుడగు పద్మ సంభవుండుఁ
గమనీయ వికసిత కమలపత్రము లన
వేయి కన్నులుగల వేల్పు ఱేడు
వహ్ని కాలాసుర వరుణానిల
శ్రీదశూలహస్తులుఁ గూడి సురుచిరముగ.

ఆ॥ గరుడ సిద్ధసాధ్యగంధర్వ ఖేచర యక్షపక్షినాగ యాతుధాను
లాదిగాఁగ బుష్పకారూఢులై రాము దీరుఁ జూడనేఁగు దెంచిరెలమి.

క॥ అత్యాదరమున రాముఁడు ప్రత్యుత్థానంబుసేసి భక్తి యొసఁగస
న్నత్యాది విధులొనర్చెం బ్రీత్యుత్కర్షాతిరేక బృంహితతనుఁడై.

అగ్నిప్రవేశ కాలమందు సీతాదేవి చెప్పినట్టి ఆవాక్యముయేమియో ప్రతిజిజ్ఞాసువు సదా స్మరణలో యుంచవలయును. అగ్నిదేవుని యీలాగున ప్రార్థించినారు. ఓ పావకమూర్తీ! మనోవాక్కాయకర్మలలో శ్రీరామచంద్ర ప్రభువునుతప్ప మఱియే పరపురుషునినైనను తలంచియుండినచో నన్నుభస్మమొనర్చుము. అట్లు కానిచో నన్ను రక్షింపుమా, అని చెప్పియే మిన్నంటి వెలుగుచున్న అగ్నియందు దుమికెను. మఱియు, పంచభూతములను సూర్యచంద్రాదులనుగూడ ఆలాగుననే ప్రార్థించెను. పృథివ్యప్తేజో వాయురాకాశములారా! అష్టదిక్పాలకులారా! నాచరిత్రమును మీరందఱును సదా యెఱింగియేయున్నారు. ఈలాగున మహాజన సభామధ్యమున ఉద్ఘాటించి ధైర్యముయొక్క మహాబలముచే, అగ్నిలో ప్రవేశింపవలసియుండిన ఎంత సత్యముండవలయునో మీరే యోచించుకొనుడు. కావున, జనులారా! ముముక్షువులారా! మీకేదైన ఆపత్తువచ్చినప్పుడు, మీరనుష్ఠించిన ధర్మముగాని, అధర్మముగాని అదే

జ్ఞాపకమునకు వచ్చును. ఏదైన అణుమాత్రము లోపముండిన అది హృదయాంతరాళమునుకలవరపెట్టుచు, మనమేమిచేయుగలము, యీకష్ట మెటుల నివృత్తియగును, మనము ఫలాని ఫలాని దుష్కార్యముల నొనర్చినవారముగాదా! ఇప్పుడీశ్వరుడు మాత్రమేమిచేయగల్గును, దాని ఫలము యిప్పుడనుభవింపవలసివచ్చినది. మన ప్రారబ్ధకర్మ యీలాగున పరిణమించినది, అని వ్యాకుల హృదయముగల్గి, దుఃఖబాష్పముచే నేత్రము పూరితమైయుండి పరితపింపవలసివచ్చినదేగాని మఱి యుపాయ మేమియుతోచదు. కట్టకడకు మరణకాలమందుగూడ యిట్టి భావమే గల్గును. దేహావసాన సమయమున యే యే భావము గలిగియుండునో అట్టి జీవి దానికనుగుణఫలమునే పరలోకమున పొందవలసివచ్చును. కావున భావశుద్ధిగలుగనిచో అంత్యకాలమున గలిగెడు అపాయమిట్టి దని ముందుగానే తెలిసికొని జాగ్రత్తపడుటమంచిది. ఆలాగున శుద్ధాత్ములై యుండిన, యేదైనకష్టములు వచ్చునప్పుడుగాని, లేక మరణకాల మందుగాని, శ్రీ సీతాదేవికి గల్గినటుల మనోధైర్యమున్ను, నిర్మలభావ మున్ను, దృఢబుద్ధియున్ను, సత్యధర్మములపై విశ్వాసమున్ను గల్గును. అట్టివారికియెంత ఆపత్తువచ్చినను, లేక దేహవియోగమాసన్నమగునప్పు డుగాని మన కేలాటి సంగటమున్ను గల్గదు. మనమేలాటి పాపకార్యముల మనోవాక్కాయ కర్మలచే చేసియుండలేదు. అదంతయు సర్వేశ్వరునకు తెలుసును. ఆతడు చరాచరప్రాణికోట్లలో, మణులలోపల సూత్రము వ్యాపించునటుల యుండువాడు. సత్యమునకును, ధర్మమునకునువిజయమే గలుగునని వేదములును, మహర్షులును చెప్పినది నిజమైనచో మనకు మంగళమేగల్గును. మోక్షనిమయములో తన కేలాటికొఱతయుగలుగదని భావన అంత్యకాలమున గలుగుటకును యీ ధర్మానుష్ఠానమే కారణ మగును గీతలో శ్రీ కృష్ణభగవానుడును యీలాగుననే చెప్పెను.

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరం।
తంతమేవేతి కౌన్తేయ సదా తద్భావ భావితః॥

తా॥ దీనియర్థము పైజెప్పినదే.

---

ఓమ్.

# దేవేంద్రుడు శాపగ్రస్తుడగుట.

ఈ చరిత్రము శ్రీమద్రామాయణాది గ్రంథములలో విస్తారముగ గనంబడగును. ఇచట సంక్షిప్తముగ నిరూపింపబడును. కౌషీతికీ ఉపనిషత్తు చదివిన వేదాంతులు కొందరు, దేవేంద్రుడు కోటి సన్న్యాసులను వధించుచు నదోషముచే లేశమైన పాపమునుపొందలేదని చెప్పుచు సత్పురుషుల మార్గము నుండి జారుచున్నారు. జ్ఞానులకు పాపపుణ్యములతో సంబంధము లేదనియు, వారు యే హింసాకృత్యముగాని, అకార్యములుగాని చేయుచుండినను పాపలిప్తులుకారనియు వచించుచు, మిక్కిలి పవిత్రమగు బ్రహ్మవిద్య నపవిత్ర మొనర్చుచున్నారు. కౌషీతికీ ఉపనిషత్తు బాగుగచదివిన దీనిలోగల రహస్యము తెలుసుకొన గలరు. అది సంస్కృతభాషలో నుండుటచే అర్థమంత సులభముగా గ్రాహ్యమగునది కాదు. ఆత్మపురాణమున ఈవిషయమై యింద్రప్రతర్దన సంవాద రూపముగా తెనుగులోగలదు. దానిలో చూచిన పైజెప్పిన కథయొక్క సారము గ్రహించుకొనవచ్చును. ఇంద్రుడు సన్న్యాసులను వధించుటకు కారణమేమియో దానిని తెలుసుకొనక వేదాంతులలో కొందరు నీతిదూరులై ప్రవర్తించుట కడుంగడు శోచనీయము. ఆ సన్న్యాసులు కేవలము వేషధారులనియు, శమదమాది గుణములుగాని, వేదాంత విచారణముగాని లేనివారగుటయేగాక, వీరు నిజమైన సన్న్యాసులగుదురా, కారా, యని పరీక్షించుటకొరకు వారిని బ్రహ్మవిద్యా విషయమై కొన్ని ప్రశ్నలడుగగా క్రుద్ధులై దేవేంద్రునిపై దూరుటచేతనే అట్టి వధ సంభవించుచున్నది. అట్టివారిని వధించవచ్చునా యని యింద్రుడనేక ధర్మసందేహములతో గూడి తనలోతాను వితర్కించుకొనియే అట్టి కార్యము జేయడమైనది. పరమ పవిత్రులగు యతులవేషము వేసుకొని క్రూరులై అధర్మవర్తనముగలిగి వర్తించువారిని శిక్షించుట రాజధర్మము. ఇంద్రుడు త్రిలోకాధిపతి యగుటచే దుష్టనిగ్రహ శిష్టపాలనము ధర్మమే యగును. ఈవిషయమై పరాశరస్మృతిని చూడుడు.

శ్లో॥ అవ్రతాహ్యనధీయానా యత్ర భైక్షచరాద్విజాః।
తం గ్రామందండయేద్రాజా చోరభక్త ప్రదోహి సః॥

తా॥ బ్రహ్మచర్యాది వ్రతనిష్ఠ లేనివారున్ను, చక్కగ గురుకుల మవలంబించి యధ్యయనము చేయనివారున్ను, భిక్షాన్నముచే యుదర పోషణమాత్రము చేయుచు తిరుగుచుండు బ్రాహ్మణులనుగాని, సన్న్యాసులనుగాని రాజు దండించందగినది. అంతేగాక యట్టివారికి భిక్ష నొసంగెడు గ్రామస్థులనుగూడ శిక్షించవలయును. ఇట్టి నియమము పూర్వముండుటచేతనే బ్రాహ్మణులున్ను, సన్న్యాసులున్ను వేదార్థజ్ఞానపరులై శమదమాదులతోఁగూడి బ్రహ్మనిష్ఠాపరులై యుండుటకు కారణమైనది. కావున ధర్మశాస్త్రమునననుసరించియే యింద్రుడు ఆలాగునజేయుటకు కారణమైనది. అంతేగాని అది అన్యాయముగాదు. ధర్మశాస్త్ర విరుద్ధమైన కార్యమెవరు జేసినను దానిచేగలిగెడు దుఃఖమును, లేక పతనమును అందరున్ను యనుభవించ వలసినదే. ఆవిషయమై రామాయణమున అహల్యాదేవిని మోహించి పాపములో ప్రవర్తించినందుచే గౌతమముని శాపాగ్నిచే యింద్రుడు యెట్టిదురవస్థను పొందెనో యీ గాథవల్ల అందరున్ను తెలుసుకొన వచ్చును.

తులసీదాస రామాయణము.

సీ॥ ఒకతఱిని విధాత యొకసుందరినహల్య బుట్టించి,
గౌతమమునికినిచ్చె నాతడు
నిష్ఠకై గౌతమీనదికిని పోవ నింద్రుడహల్య
పొందుఁగోరి చనుదెంచి రమియింప
ముని జ్ఞానదృష్టిచే దెలిసెను
సర్వంబు తేటపడగ తాఁ మన్నేత్రుండయ్యె
దరుణిబండగ నింద్రునోడలెల్ల
యోనులై యుండు నటుల.
గీ॥ శాపమీయగ శిలయయ్యె......
(ఇక యీ విషయమై భాస్కర రామాయణమున జెప్పినది జూడుడు.)

క॥ ప్రీతిదఱి వేచియింద్రుడు, గౌతమవేషంబుపొసగ గైకొనివేగం
బే తెంచి రూపలావణ్యాతుల్య నహల్యజూచియతిమోహితుడై.

క॥ కోరికలొప్పారగనా సారసముఖి జేరి పాకశాసనుడంతం
జారు నితంబిని నన్నున్ మారసుఖక్రీడదనుపుడు మక్కువతోడన్.

చ॥ అనుడు నహల్యయింద్రుడు ప్రియంబున గౌతమ వేషియైనవాఁ
డని మదిలోనెఱింగి ముదమందగ నిక్కడరమ్ము గ్రక్కునన్
మనసిజునమ్ము లందుని సెమానము చిక్కిన మన్మథుండవై
ననురతి చాతురింగలిసి నన్నును నిన్నును గావునావుడున్.

క॥ తరుణి నిను జూచినప్పుడె పరితుష్టుండనైతి నిఁక ప్రసవాయుధజి
త్వరుడనయిపోదునని తత్పరమతి వాంఛితముదీర్చి తత్తరపడుచున్.

క॥ ఉటజము వెలువడియటముం
దటదాబొడగాంచె వృత్రదమనుడు
వికటోత్కట విస్ఫుటజటి నతిసం
ఘటితతపః కృశశరీరకంపన కలతున్.

మ॥ కరసంయుక్త సమిత్కుశాంచితుని గంగాపూతతోయార్ద్రభా
స్వరమూర్తిన్ గతధూమ సంజ్వలిత సజ్వాలాగ్ని కల్పన్ సురా
సురదుర్ధర్షుని నకుపాదురచిత శ్రుత్యర్థవాదున్ వ్రతా
విరళామోదు సుధీయుతుం బ్రతిహతా విద్యాతమున్ గౌతమున్

క॥ అప్పుడు గౌతముడింద్రుని నిప్పులురాలంగజూచి నీవుకపటివై
చొప్పగు నారూపంబునఁ దప్పొనరించితి దురాత్మ తగదనకంచున్.

క॥ చండక్రోధంబుననీ యండంబులుదునిసి దర్పమడంగుదురాచా
రుండయనగ నాఖండలు నండంబులు దునిసిపుడమి నప్పుడపడియెన్.

వ॥ ఇట్లయ్యింద్రుని శపియించి యహల్యనమాంగల్యంగదిసి యా వనంబున ననేక దివ్యసహస్రవర్షంబులు వాయు భక్షణవు, నిరాహారవు, భస్మశాయినివియునై యెవ్వరికింగానరాక పాషాణంబవై యుండుమని యంతటఁ గరుణార్ద్రమనస్కుండై యెప్పుడీవ్వనంబునకు రామచంద్రుండు వచ్చునప్పుడు శాపవిముక్తవై తదాతిథ్య సత్కారంబున నిజరూపంబు గైకొని ముదంబందెదవనిపలికి యాయాశ్రమంబు విడిచి సిద్ధచారణ సేవితంబైన హిమగిరి శిఖరంబునకేగి తపంబాచరించుచుండె.

విషయప్రవృత్తిచే ఆశ్రమము మలినమైనదనితలంచి గౌతముడు హిమాలయమునకు వెళ్ళెను. దీనినిగురించి ఆలోచించిన యిప్పుడు కొన్ని

మఠములలో, ఆశ్రమములో ఎన్ని దుష్కృత్యములు జరుగుచున్నవి. మరల అచ్చోట తేజస్సు దైవచైతన్యము దివ్యశక్తి యేముండును? అందు వల్లనే ఆశ్రమములు, మఠములు పతనమొందుటకు కారణమగుచున్నది. ఇంద్రుడు వేదవేదాంతములనంతయు నెరింగినవాడనియు, బ్రహ్మజ్ఞానము గలవాడనియు, శాస్త్రములలో నచ్చటకన్పడుచున్నది. అట్టియింద్రుడు దుష్ప్రవర్తకుడగుటచేత శ్రీ గౌతమముని శాపముచే యేలాగున శరీర మంతయు యోనులుగలవాడయ్యెనో, యీ సత్యమెరింగిన బ్రహ్మజ్ఞాను లకు పాపములంటవని చెప్పుచు తిరుగుచుండు కొందరి గురువులగతి యే మవునో విజ్ఞులూహించు కొనదగినది. గౌతమముని శాపముచే వికార రూపమంది దేహమంతయు భగములుగలవాడగుటచే తానుచేసిన పాప మునకు భయమునొందినవాడై శాపాగ్ని శమనము కొఱకు మునిని వేడు కొనిన తరువాత మహర్షి కరుణగలవాడై శాపమునకు కొంతశాంతికలిగే లాగున అనుగ్రహించెను. అనగా యింద్రునికి మాత్రము కాయమంతయు ఎల్లప్పుడున్ను భగరూపములుగాను, చూచేజనులకు మాత్రము నేత్రము లుగా కనిపించేలాగున శాపమును సడలించెను. అప్పటినుండియే సహ స్రాక్షుడని దేవేంద్రునికి పేరుకలిగెను. మరియు యీ కథను గురించి విరక్తులు తెలిసికొనదగిన గొప్పసారముగలదు. కామాగ్ని యెంతదారుణ మైనదో, అది యెట్టివారి. గూడ వివేకశూన్యునిగానొనర్చి విషయాగ్నిలో పడత్రోయునో గ్రహించు కొనందగినది. దేవేంద్రునికి శచీదేవి మొద లైన దేవతాస్త్రీలు భార్యలైయుండియు, మఱల దేవవేశ్యలగు ఊర్వశీ, మేనకా, రంభ, ఘృతాచి, తిలోత్తమ మొదలగు దేవతాస్త్రీలుండియు పరమతపస్వినియు, మహామహర్షి ధర్మపత్నియు, తపోధ్యానవ్రతములచే కూడినదియునగు అహల్యపై మోహాముగలిగి కలయుట ఓహో, యెట్టి యాశ్చర్యము! కామాగ్ని యెంతదారుణమైనది. కావుననే శాస్త్ర మీ లాగునన చెప్పుటకు కారణము,

శ్లో॥ సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్నిశిఖా యథా।
ఉపభోగేన కామేన హ్యాశా చోపరి వర్తతే॥

తా॥ అనేక బారువులుగల నేతితోను, కట్టెలతోను, అగ్ని హోత్రుని తృప్తిపరచ చూచిన అగ్నిజ్వాల అంతకంతకు యెట్లు పెరు

గునో ఆలాగున విషయభోగము ఎంతకెంతకు అనుభవించునో అంత కంతకు ఆశ పెరుగునేగాని తరుగదు. దీనికి దేవేంద్రుడే దృష్టాంతము.

శ్లో॥ యథా నిరింధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి।
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి॥

తా॥ హోమాగ్ని శమించవలసి యుండిన సమిత్ ఘృతాదులు వేయకవుండినచో, స్వయముగానే నిప్పు చల్లారి పోవును. నేతిచేతను, కట్టెలచేతను, అగ్నిహోత్రుని చల్లార్చజూచిన అదెట్లు తరముగాదో, విషయములనుభవించి తృప్తి పొందవచ్చు ననుటయు నటువంటిదే. హోమగుండములో నెయ్యిన్ని, పుల్లలున్ను వేయక పోవుటచేతనే అగ్ని యెట్లు శాంతినొందునో, అట్లే విషయములనుండి యుపరతిని బొందిన చిత్తమునకుమాత్రమే కామదోషాగ్ని శమించును. ముము క్షువులంపరికిన్ని దీనికన్న పరమోపదేశము యేమికావలయును? తాను వేసిన విత్తనము యెంతవరకదే విధముగుచెట్టుగానేర్పడి ఫలమునిచ్చునో, ఆలాగున తన నీడను దూరముగ వదలించి నడువశక్తి గలవారెవరో, అట్టివారుండినమాత్రమే కర్మదోషము వారినంటదు. మఱియు నొకవేళ కర్మదోషము తనకంటనిజ్ఞానముగలవారెవ్వరైన యుండినను, వారుగూడ తనమనస్సును చూచియే సామాన్య జనులుకూడ నడవగలరని తలంచి ధర్మమార్గము ననుసరించియే ప్రవర్తింతురు. గీతాచార్యుడగు శ్రీకృష్ణ భగవానుడాలాగునే యుపదేశించెను.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

తా॥ ఉత్తముడు యేయేకర్మను ఆచరించుచున్నాడో, యితర మైన ప్రపంచజనముకూడ ఆయాకర్మమునే ఆచరించుచున్నది. మఱియు నట్టియుత్తముడే యేవాక్యమును ప్రమాణముగా చేయుచున్నాడో, ప్రపంచజనులుకూడ దానినే ప్రమాణముగా నమ్మి చేయుచుందురు.

దీనికన్న పరమప్రమాణమేమి కావలయును? దేవేంద్రునియజ్ఞాది క్రతువులు గాని, వేదపఠనముగాని, యేమైన చేయగలిగినదా? కావున కర్మయొక్క మహిమను ప్రతివారున్ను జాగరూకతతో తెలిసికొని ప్రవర్తించందగినది.

అధ్యాత్మరామాయణము చూడుడు.

శ్లో॥ దృష్ట్వాఽయాంతం స్వరూపేణ మునిః పరమకోపనః।
పప్రచ్ఛ కస్త్వం దుష్టాత్మన్ మమరూపధరోఽధమః॥

శ్లో॥ సత్యం బ్రూహి నచేద్భస్మ కరిష్యామి న సంశయః।
సోఽబ్రవీద్దేవరాజోఽహం పాహిమాం కామకింకరమ్॥

శ్లో॥ కృతం జుగుప్సితం కర్మ మయా కుత్సితచేతసా।
గౌతమః క్రోధతామ్రాక్షః శశాప దివిజాధిపమ్॥

శ్లో॥ యోనిలంపటదుష్టాత్మన్ సహస్రభగవాన్భవ।
శప్త్వా తం దేవరాజానం ప్రవిశ్య స్వాశ్రమం ద్రుతమ్॥

దీని అర్థము పైపద్యములోనిదే.

---

# అహల్యాశాప కారణము.

అహల్యాదేవి శాపమును గురించి కొందరీలాగునవితర్కింతురు. అదేమన గౌతమ మహర్షి బ్రహ్మముహూర్తారంభమున నదీస్నానమునకు వెళ్ళునప్పుడింద్రుడు గౌతమముని వేషము ధరించివచ్చిగదా యహల్యను చేరెను? కావున అహల్యయందు దోషమేమిగలదు? ఈసత్యమును తెలిసికొనక గౌతముడింత ఘోరముగ శపించవచ్చునా?

సమాధానము. ఇది రామాయణాది గ్రంథములను జాగ్రతగా పరిశీలించని కారణముచే గలిగిన సంశయమేగాని, మరియొకటిగాదు. ఇంద్రుడు, గౌతమ రూపమును ధరించి వచ్చినప్పటికిన్ని యహల్యయతడింద్రుడని బాగుగా తెలిసికొనెను. అంతేగాక వారుభయులున్ను కామవికారములగు కొన్ని సంభాషణల గూడసలిపిరి. ఇంద్రుడని తెలిసికొని దుష్టకార్యములో ప్రవర్తించినందుచే గౌతముడు శాపము పెట్టవలసివచ్చినది. మహాముని ధర్మపత్నియైయుండియు తపోవనములోను, తాపసులు పర్ణశాలలలోను యుండి తపమొనర్చుచున్నదై యుండియు, పరమపావనుడగు మహర్షి సేవయే నిరంతరముచేయునదై యుండియు, వేదవేదాంతముల జ్ఞానవాక్యము సదాశ్రవణముజేయునదై యుండియు,

వ్రతనిష్ఠలు సలుపునదై యుండియు, కొంతవరకు వయస్సు చెల్లినదై యుండియు; గౌతముడు నిస్నానమాచరించి త్వరలోనేరావచ్చునని తెలిసినదై యుండియు, మనసును నిలుపశక్తి లేనిదై కామపరవశముగలదై పోయినదని చెప్పునప్పుడు విషయనిరోధమెంత కఠినమైనదో, యెట్టివారిని గూడ మోహపరవశ మొనర్చునో, యూహించుకొనవచ్చును. ఓహో! విషయాగ్ని యెట్టిదారుణమైనదో, యెట్టి వారిమనస్సునైన కాల్చివేయునో, యీగాథవల్ల తెలిసికొనవచ్చును. గౌతమభార్యవలె తపమొనర్చువారును, అరణ్యవాసముచేయువారును, బ్రహ్మవిద్యాశ్రవణము జేయువారును, యిప్పుడు ప్రపంచములో భక్తురాండ్రని, తపస్వినులని, సన్యాసినులని, జ్ఞానముగలవారని చెప్పునారీమణు లెంతమందియుందురో, యిట్టిసంగతి వేదాంతమార్గములోనుండు నారీమణులందరున్ను, సర్వదా ఆత్మలోనాలోచించుకొనందగినది. ఈవాక్యముయొక్కయర్థమును విచారణచేయక పోవుటచేతనే వేదాంతమార్గావలంబినులగు కొందరు నారీమణులు విచ్చలవిడిగా తిరుగుటకున్ను, నియమరహితులై ప్రవర్తించుటకున్ను, నివాసనియమము లేకయుండుటకున్ను కారణమగుచున్నది. కావున యిట్టివిషయములలో స్త్రీలు మిక్కిలి జాగరూకతగలిగి ప్రవర్తించిన మాత్రమే తమ శీలమును మలినముగల్గనీయక యుండగలరు. లేనిచో, గౌతమపత్నికిగలిగిన దురవస్థయే తమకుగూడ గలుగునని జ్ఞప్తిలోయుంచుకొనవలయును. వీరిలోగూడ కొందరు వేదాంత గురువులు జెప్పునట్లాత్మకు పాపమున్ను లేదు, పుణ్యమున్ను లేదు. అదంతయు సంకల్పమాత్రమే, యనిచెప్పి విహరించుచున్నారు. కావున యెల్లప్పుడును పాపభీతిగలిగి ధర్మచ్యుతిగలగనీయక చూచుచుండవలయును. కావున పంచశీలలమును ప్రాణమువదలి పోవువరకున్ను, అనుష్ఠించందగియున్నది. పంచశీలమనగా 1. ఆహారనియమము 2. నివాసనియమము 3. అనుష్ఠాననియమము 4. సంసర్గనియమము 5. కార్యనిర్వాహణనియమము. ఇవిగలిగియుండిన యెప్పటికిని పతనముగలుగదు. భాస్కరరామాయణము చూడందగును. ఆపద్యములన్నియు, దేవేంద్రుని శాపమును గురించిన ప్రక్కనే వ్రాసియుండుటచే మఱలయిచట వ్రాయంబూనలేదు.

శ్లో॥ దుర్లభో విషయత్యాగో దుర్లభంతత్త్వదర్శనం

దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥

తా॥ విషయనివృత్తి మహాదుర్లభము. తత్త్వదర్శనము గూడ నట్లు దుర్లభము. సహజామనస్కస్థితి మరింతదుర్లభము. ఇవన్నియు సద్గురుదేవుని కృపవల్లనే గలుగవలసి యున్నవి.

శ్లో॥ విషస్య విషయాణాం చ దూరమత్యంతమాంతరమ్।

ఉపభుజ్య విషంహన్తి విషయాస్స్మరణాదపి॥

తా॥ విషమునకున్ను విషయమునకున్ను చాలదూర వ్యత్యాసము గలదు. ఏలన విషము భుజించినవారిని నశింపజేయును. విషయమో స్మరించినవారిని గూడ నాశమొందించును. మహాకాల సర్పమైనను కరవబడిన మాత్రమే విషమెక్కును. విషయమో యెంతోదూరమున నుండు వారికిగూడ తలంచిన మోహ పరవశత్వము గలుగజేయును. కావున విషసర్పమునకన్న విషమకరమైనది విషయమని గ్రహించి విషయులకు దూరముగానే యుండవలయును. ఆలాగున యీజ్వాలించుచుండు అగ్నియైన తనలో ప్రవేశించిన వానిని దహించును. విషయాగ్నియో తలంచువారిని కాల్చివేయును. ఓహో! విషయాగ్ని ఎంత దారుణమైనదో దీనివల్ల తెలిసికొన వచ్చును.

శ్లో॥ అగ్నికుండ సమా నారీ ఘృతకుంభ సమో నరః।

సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్॥

తా॥ అగ్నికుండము వంటిది స్త్రీయనియు, నేతికుండవంటి వాడు పురుషుడనియు గ్రహించు కొనవలయును. కావున యుభయులయొక్క సహవాసము మనసును కరగించును ఇందువల్ల విరక్తులగు బ్రహ్మనిష్ఠులగు స్త్రీపురుషులు వేరు వేరుగానే యుండవలయును. ఇది శ్రీ దత్తాత్రేయులు యుపదేశించినదే కాని సామాన్యులు చెప్పినదికాదు. అవధూతగీతలో యీ శ్లోకము కనందగును. అగ్నికుండముపై నేతికుండపెట్టి కరుగనికాలమెప్పు డేర్పడునో, అప్పుడే ఒకేస్థలములో, ఉభయులుండిన మనసుకు మార్పుకలుగదు. ఇది వుభయులకున్ను సమానమైనది. లేక మనశ్శక్తిచేత గాని, తపశ్శక్తిచేతగాని, యోగశక్తి చేతగాని, నేతికుండను నిప్పుగుండమున పెట్టిన కరగనీయక జేయశక్తిగలవాగుందురో, వారికి భేదము లేకనే యెచ్చటయినాయుండ వచ్చును అట్టి

వారెంత మందియున్నారో ప్రతిముముక్షువులున్న జ్ఞాపకమునందుంచు కొనవలెను. ముముక్షువులు చెడకూడదని తలంచి మహర్షులెంతో కరుణగలిగి యిట్టి దృష్టాంతము తెలుపడమైనది.

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥

తా॥ ఇంద్రియములు విషయోన్ముఖములై సంచరించునప్పుడు ఎవరి మనస్సుగూడ దాని ననుసరించునో వాని ప్రజ్ఞను, తుపాను సముద్రములోయుండు పడవను ముంచునట్లీతని ప్రజ్ఞను నశింపజేయును. ఇది శ్రీ కృష్ణభగవానుడుపదేశించినది. తుపాను వచ్చునది తెలిసికొని నావికు లేలాగున అపాయము గలుగని స్థలములోనికి ఓడను చేర్చుదురో అట్లు చేయనిచో యెట్లు సాగరములో మునిగిపోవునో, ఆలాగున ముముక్షువు లెచటనుండినా విషయదోషముల చిహ్నములు గోచరించునో యచ్చోటును విడిచి అట్టిపతనము గలుగని ప్రదేశములోనికి నివాసమును మార్చుకొనవలయును. ఇది సన్మార్గచరితులగు నారీమణులకున్ను, నరులకున్ను, గొప్ప ధర్మోపదేశము లేనిచో విషయసాగరములో మునుగుటనిక్కము. ఇదివరలో నిరూపించిన వేదాంతులు, యోగులు, తపస్విలు, (తాపసులు) భక్తులు ఆచరణలోపము చేతనే పతితులైనట్లు ఆయాకథలవల్ల మీరెరింగియే యున్నారు. కావుననే మహామన్త్రములకన్న అనుష్ఠానమే గొప్పదనిపేరు యీ గ్రంథమునకు కల్పించుటకు కారణమైనది.

---

# నహుష చరిత్రము.

ఇది చాల విచిత్రమైనది. కర్మప్రభావముచే మానవుడు దేవాధిదేవుడగుటయు, తిర్యక్ జంతువగుటయు సంభవించుచున్నది. ఒకే జన్మములోనే మానవుడు యీమూడవస్థలను బొందుచున్నాడు. ఉచ్చనీచావస్థలకుకారణముమానవునియొక్క శుభాశుభకర్మలేయగుచున్నవి. వృత్రాసురవధచే బ్రహ్మహత్యాపాతకము యింద్రునికి గలిగినందుచే

దేవేంద్రస్థానమునకు యనర్హుఁడగుటవల్ల నత్తరి మునులు దేవగణము దేవేంద్రస్థానమునకు తగిన పుణ్యాత్ముఁడు, ధర్మశీలుఁడు దేవతలలో నెవరున్న లేనందుచే భూలోకమున ధర్మాత్ముఁడగు నహుషుఁడు తగినవాఁడని నిశ్చయించిరి. మహాభారతము, ఉద్యోగపర్వము.

వ॥ నహుషునితో పాకశాసను తెఱంగెఱింగించి యిట్లనిరి.

క॥ రమ్మింద్రపదవి సేకొని, మమ్మెల్లను నరయుమనిన మానవపతినా
కమ్మహిమకుఁ దగుమాహాత్మ్యమ్ముగలదె నన్ను నేల యలచెదరనినన్.

వ॥ అంత నిలువక యత్యంత ప్రార్థనంబుసేసి

క॥ యమవరుణాదిత్రిదశులు, దమతమశక్తి ప్రభావదర్పంబులు భూర
మణునకు బంచియిచ్చిరి, ప్రమోదమునఁగాంగ మునిసభామధ్యమునన్.

వ॥ ఇవ్విధంబున నిచ్చియధిక బలసమన్వితుంగావించి తోడ్కొని పోయి పూజ్యంబగు దివిజరాజ్యంబున నభిషిక్తుంజేసిన, నతండును బరమ ధర్మపరుండై కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది సమస్త దేవయోనులవలనను దేజోభాగంబులు పుచ్చికొని మహానుభావుండై దివ్యమునిసేవ్యంబైన యద్దేవేంద్రపదంబు సేకొని, తుంబురునారదాది వినోదపాత్రంబులును, రంభాద్యప్సరోగణంబులుం గొలువ, నభిమత భోగంబులనుభవించుచు మదంబుమిగిలి మన్మథాధీనుండై వర్ధిల్లు సమయంబున నొక్కనాడు,

తే॥ మహితలావణ్యమున నసమానయనఁగఁ
జనిన పౌలోమి యా నహుషునకు నయన
మార్గగోచరయగుటయు మదనబాణ
భిన్నహృదయుఁడై ధృతిబాయబెట్టి యతఁడు.

క॥ సురలోకరాజ్యపదవిన్, గరిమంబున నున్న నన్ను గవయంబరమా
దరలీల జతురయగు నీ సరసిజముఖి రామి యేమి చందముతలపన్.

క॥ అనియుప్పొలతిం బిలిపించిన నదియును భయమునంది శీఘ్రము దేవే
జ్యునిసదనమునకు శరణం బనుచుంజనుటయును వాసవాచార్యుండున్.

వ॥ పరమాదరంబున నద్దేవిని గారవించి నిన్ను నహుషుదుర్వినయంబు బొరయకుండ నరయువాడ నాఖండలుండునా యత్నంబున నవశ్యంబును దడయక వచ్చునని యూరడించిన

క॥ అదియెల్ల నెరిగి కోపం బొదవంగ నహుషుండు గురునకు చితమే యేన
మ్మదితం బిలిపింపఁగ దన, సదనంబున నవ్వుచు టనియె సంక్షుభితుండై.

చ॥ అనుడు మునీంద్రులున్ సురలు నక్కట నీమహనీయ గౌరవం
బునకుం బరాంగనం గవయు బుద్ధి జనించుట యీడుగాదు నా
విని మునుపూని యిమ్మెయి వివేకము గౌతము భార్య బాకశా
సనుఁడెడఁ గోరుచోఁ గరపఁ జాలర మీరది యెట్లు సెప్పుడా.

వ॥ అనుచు నతండు నుగడుం గోపించిన భయంబుం గొని వారల పౌలోమి నతని పాలికిం దోడ్కొనివచ్చువారై పూని బృహస్పతికడకుం జని యద్దేవియు వినుచుండ యిట్లనిరి.

క॥ నహుషుడు మహేంద్రపదవీ, సహితుడు శచికిన్
వరింప జనునాతని లోకహితంబుగాఁ గఁ బుచ్చుము
మహాత్మ తచ్చిత్తమున యమర్షంబడఁగన్.

క॥ అనవుడు శోకంబడరఁగ ననిమిషగురు జూచి యిట్టులను శచి యటు
వుచ్చినదూఱరాదెనను శుచి యనిమీకోనియాడు టెల్లనన్నృతముగాదే.

వ॥ అనిన విని దరహాసితవదనుండగుచుఁ బురుహూత పురోహితుండు

క॥ నహుషుండు పనుచు వాడటె విహితానుష్ఠాన పరులు వీరటె తా లో
కహితంబటె యిదిమనకున్ మహనీయమకాక యెట్లుమానగవచ్చున్.

వ॥ అనియుల్ల సంబాడి యనిమిషులను ఋషులను జూచి యిట్లనియె.

తే॥ శరణుసొచ్చిన రక్షింపఁజాలియుండి
కడపిపుచ్చిన నూర్ధ్వలోకములు దప్పుఁ
బుణ్యకర్మంబుల ఫలత బొందుననదె
కమలగర్భుండుఁ దొల్లి జగద్ధితముగ.

వ॥ అని యను రూపాలాపంబుల నిషేధింపవారలట్లేని గర్తవ్యం బెయ్యది యూహింపుమనిన, నద్దేవి నహుషుకడకుం జని సముచితంబుగా దదీయ సాంగత్యంబున కెడవలికి కొనివచ్చునది యటమీఁద మనమందర ముంబురందరున కభ్యుదయంబగు తెఱంగాచరించువార మనుటయు వాచస్పతి వచనంబులకు సంతసించి సురసంయమి సంఘంబులరిగిన యనంతరంబ.

క॥ పౌలోమియు నానహుషుని పాలికిజనుటయు నతండు భావజవికృతి
వ్యాలోలమానసుండై లీలాసంభావనా లలితముఖుండయ్యెన్.
వ॥ అట్టియెడ
ఉ॥ అల్లనయింతి యిట్లనియె నారసివాసవు కల్మిలేమియుం
దెల్లముగా నెరింగికొని తేకువ లేకిటవచ్చితొప్పు నా
యుల్లము శంకితంబగుచు నుండగ వేగురపాటు మేలనీ
వెల్లనెరుంగు దిప్పుడెడ యిచ్చుట యుక్తమునాకు జూడగన్.
వ॥ అని యొడంబఱచి కొండొక కాలంబెడవలికికొని యింద్రాణియు మగుడంజనుదెంచె నమరగణంబును మునిజన సహితంబుగా విష్ణుదేవు పాలికి రహస్యవృత్తింబోయి జిష్ణునిచరితంబు వాపుట గోరిన శౌరి గరుణాయత్త చిత్తుండై.
క॥ హాయమేధంబుననాకుం బ్రియమొనరింపగ వృత్రభేదికిబుణ్యో
దయమగునావుడు వారలు రయమునజని రందరు బురందరు కడకున్.
ఇంద్రుండు నహుషతేజో విశేషంబుఁజూచి మరుగు వడుట.
క॥ చనియతని నశ్వమేధంబునఁ గల్మషరహితుఁ జేయబురుహూతుండుం
దనపురికి నరిగి నహుషుంగని తత్తేజో విశేష కంపితుడయ్యెన్.
వ॥ ఇట్లువృత్రారిదన బ్రహ్మహత్య వాయుటయేగాని నహుషునంతబలంబు లేమింజేసి భయాకులిత చిత్తుండై
క॥ ఎందేనిజనియె నాతని సుందరియును నెమ్మనమున శోకోద్రేకం
బొంది పురందరుడరిగిన కందువయే నిప్పుడెట్లు గాంతునె యనుచున్.
వ॥ నిశాసమయంబున నుపశ్రుతి నారాధించిన దదీయాధిదేవత నీసత్యంబువలనంగనుదని జెప్పి యనంతరంబ సాకారయై పొడసూపినఁ బౌలోమి నీవెవ్వరవని యడిగిన నదియును వత్పాతివ్రత్యసత్యశౌచంబులకు బ్రియంబంది వచ్చితి నుపశ్రుతినని చెప్పి నీకుంబాకశాసనుంజూపెదరమ్మని తోడ్కొని హిమవంతంబు నుత్తరంబున మంజుమంతంబను మహాశైలంబునకరిగి దానియందు శతయోజన విస్తీర్ణంబైన యొక్క సరోవరంబుసొచ్చి యచ్చట నుల్లసిల్లు పంచవర్ణ కమనీయంబులగు కమలంబులలో నొక్క నాళంబు భేదించి ముందట బ్రవేశించె

నింద్రాణియు దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్న సురపతింగన్నంత నయ్యుపశ్రుతి నదృశ్యంబగుటయు.

క॥ పతిసన్నిధివడసి మహాద్భుతమందెడు శచి తదీయ పూర్వానుకర్మ
స్తుతిసేయుచు నిలచిన నతడతివంగని సంభృతాదరాత్ముఁ డగుచున్.

ఉ॥ ఇచ్చటనేను నిల్చుటిది యెట్టు లెఱింగితి నన్నుగాన నీ
వొచ్చినకార్యమేమి యనవద్యగుణోత్తర చెప్పునావుడుం
బొచ్చెము లేక యానహుషుపోయిన పోకలుదానికిందగం
జెచ్చెర కాలయాపనము సేసిన భంగియు జెప్పెదేవియున్.

వ॥ చెప్పి యుపశ్రుతి తెఱంగును నతనికెఱింగించి దేవా నీవిత్రిశంకు కాశుండవై భవత్పాపంబున నహుషునకు బరాభవం బొనరించి నన్నురక్షింపక తక్కిన నుక్కిముండగు నతనిపాపనిశ్చయంబున నాపద వచ్చుననిన విని వల్లభుకు దివిజవల్లభుండిట్లనియె.

క॥ ఆనహుషుబాహుగర్వమనూనంబై యున్నయది సముజ్జ్వలముని స
న్మానప్రవృద్ధ మగుటను, దానంగాలంబు వేచెదను జయమునకున్.

చ॥ తఱియగు నంతకున్ రిపునుదగ్రతసెచుట నీతిసీవు నా
కఱపిన యట్లుచేయుము తగంజని యాతనిగాంచి నన్ను నె
తెరగునైన బొందగమదిన్ దలపోతయ గల్గెనేనిఁ గ్ర
చ్చఱ మునివర్గవాహనుడవై చను దెమ్మను మంతగీరెడున్.

అ॥ అనినట్ల కాకయని పతిపీడ్కొని, యింతినహుషుపాలి నేగుదెంచి
నతడు దమకమడరనద్దేవి బెద్దయు నాదరించి యిష్టమడుగుటయును.

వ॥ ఇంద్రాణియు నిట్లనియె. మననిరూపించిన సమయమునకు గొండొక తడవుగలదు. కాలంబగుటయు నిన్ను వరియించెద. నీవు మహా మునివాహనుండవు గావలయునది నాకు బ్రియంబు. నీకు ననన్యసామాన్యంబైన యానంబు తేజోవిశేషకరంబగు ననిన నప్పలుకులకు నహుషుండు ప్రహర్షచిత్తుండై.

ఆ॥ ఏనుదక్కనొరుల కెవ్వనికైన నవ్వాహనంబు నెక్కవశమె నీవు
సమ్మదంబుగాగ సప్తర్షిగణమునా యందలంబు మోవ నరుగుదెంతు.

క॥ అని వనితబంచి యప్పుడ
మునులంబిలిపించి వకార్యముఁన దనకున్

వాహనముగ జేసి యొకింతయు
ననుమానము లేక తిరిగెనతఁ డెల్లెడలన్.

క॥ చని పౌలోమియు సురగురుగని నహుషుఁడు వేచియున్న కాలం బెడలే
దనిమిషనాథున కిత్తరి ననుగ్రహము సేయవలయు నవహితబుద్ధిన్.

వ॥ శరణాగతయైన నన్ను రక్షింపుమనిన నతఁ డిట్లనియె

క॥ ఆనహుషువలన నాపద రానీనాతనికి నాతురత గావింపం
బూని యొనర్చెద వేలిమిదానను మునివాహనతగతస్థైర్యుఁడగున్.

క॥ వెరపుననీపతియునికియు నరసెదనని యూఱడించి యప్పుడవై శ్వా
నరు నర్చితుజేసి పురందరు తెఱఁగుంజెప్పి యతనిఁదడవంబనిచెన్.

అగ్నిదేవుడిందు్రని వెదకి బృహస్పతికిం దెలుపుట.

వ॥ పనిచిన వహ్నియు వనితారూపంబునం జని మనోగతి యగు
టం జేసి సర్వదిశలును భూమ్యంతరిక్షంబులును, గిరివిపినంబులును
గొండొకసేపునకుం గవయంజూచి సంక్రందను నెందునుంగానక మగిడి
వచ్చి వాచస్పతికి నత్తెఱంగెరింగించి, నాకు జలంబులు ప్రవేశింపరామి
నందపరికింపనేరనైతి, నప్పులవలన నగ్నియు, బ్రాహ్మణులవలన క్షత్రియ
జాతియు నశ్మంబువలన లోహంబును నుద్భవించె. వానివాడిమి యెల్ల
యెడలునుం జెల్లు దమతమ జన్మస్థానంబులయందడంగుంగావున నీళ్ళు నాకు
సంక్షయంబు సేయుట సుప్రసిద్ధంబనిన విని యనిమిషగురుండు హవ్య
వాహను నత్యంత గౌరవంబునం గనుంగొని.

మ॥ సకలస్థావర జంగమంబులును భవత్ సాన్నిధ్యమాత్రంబునన్
వికసిల్లుంగ్రతు వైభవంబులు జతుర్వేదంబులున్ నీవ పా
వకనీయంద జలంబులుంగలిగె విశ్వవ్యాప్తి మైనున్నన్
కొకచో నెట్టులగమ్యుమయ్యె నిను నీవ్రాహింప పెంపారగన్.

ఉ॥ ఏనును బ్రహ్మమంత్రముల నెంతయు నీకభివృద్ధి జేసెదం
గాని విశంకతన్ సలిలగామివి గమ్మని నంగ్రశానుడుం
బూనికనేగి వారినిధి భూరి నదీ సరసీతటాక సం
తానమురోయుంచు జని శతక్రతుడున్న సరోవరంబునన్.

ఉ॥ అంబురుహంబులం గలయనారసి నొచ్చియొకండు నాళసూ
త్రంబున నున్న యింద్రుఁగని రాగముఁనన్ గురునొద్ద కగ్గి శీ
ఘ్రంబున నేఁగుదెంచి తనకన్న తెఱంగెఱిగింప నాతఁడు
ల్లంబుననుల్లసిల్లి సురలన్ మునులందగగూర్చి గ్రక్కునన్.
మ॥ దివిజాధీశ్వరు పాలికిం జని కృతార్థీభూతచేతస్కుఁడై
వివిధస్తోత్ర పరంపరాచతుర వాగ్విన్యాసతం బ్రీతుఁ జే
సి వరిష్ఠంబగు నీదుకృత్యము ననుష్ఠింపగ నీవుత్సహిం
పవు నీకేమికొఱంతవృత్రవధయే పాపంబు రూపింపుమా.
క॥ శరనిధిఫేనంబుననా, హరిపొంది జగద్విరోధియగు వృత్రునిదాఁ
బరిమార్పనీకువిజయము, దొరకొనియెంగాక దీనదోసముగలదే.

వ॥ అనిసముచితంబుగా సంబోధించిన గురుని సంభాషితంబుల నిర్దోషితుండై, నిజరూపంబువహించి సకల సుమనోమునిసహితంబుగ నతనిసంభావించి జంభారిగర్వ్యం బెయ్యదియనియడిగిన నాచార్యుండి తండెఱింగినను విస్పష్టంబుగా నహుషు వృత్తాంతంబంతయు వివరించెదం గాక యని తలంచి యిట్లనియె.

క॥ నాఁడట్లు నీవునీదగు పోఁడిమిసెడియడగుటయును భువనంబుల కె
వ్వాఁడునురక్షకుఁడయ్యెడువాఁడి మగఁడు లేమిఁ ద్రిదశవర్గము మునులున్.
ఉ॥ ఒండెఱుచేతఁ బీడవడనోపక రక్షకుఁడైనవాని నా
ఖండలతుల్యు నేమిగతి గాంతుమొకోయనుచున్నచోట న
ద్దండబలైక రక్ష్యము శతక్రతు రాజ్యముదానినేల న
న్యుండుసమర్థుఁడే యనుచునొల్లరు దివ్యులలోననెవ్వరున్.

వ॥ అట్టి సమయంబున మునిజన సహితంబుగ ననిమిషులు నహుషు కడకుంజని మనంబుల మనుజుండను ననుమానంబు దక్కియుతని నింద్రపదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన నతండును దాను హీనబలుం డనని శంకించినందమతమ తేజంబుల యంశంబు లతనికొసంగి శక్తి మంతుంగావించి యభిషిక్తుం జేసిన.

క॥ మహనీయభవత్పదవీ మహితుండై నహుషుఁడేచి మదమున ధర్మ
స్పృహ దక్కి తన్ను నిప్పుడువహియింపగ సన్మునీంద్రవర్గముఁ బనిచెన్.

ఆ॥ ఇదియకాదు మఱియు నెన్నియు దుర్విన
యములు గలవు వాని కలసినిన్ను
వెదకవచ్చితిమి వివేక హీనుండగు
నతనిఁ జెఱుప నిప్పుడవసరంబు.

వ॥ అదియెట్లంటేని వినుము, నాఁడు హరిపంపునం జేసిన యశ్వమేధంబున నీవపగతకల్మషుండవై నను నహుషునకు తేజోహాని లేమిజేసి నతని యాక్రమింప రాదయ్యె. నిప్పుడు మహామునుల నధఃకరించి యతండు నిస్తేజుండయ్యె యున్నవాఁడు గావున నీచేతం జెడునట్లగుటయుం దురగమేధ ఫలపరిపాకంబయింకను త్సాహంబు సేయుమనుచున్న సమయంబున యమవరుణ కుబేరులు సోమసహితంబుగా నరుగఁదెంచి పురందరు గాంచిన నతండు ప్రియంబంది యప్పటికార్యంబు తెలంగు వారలకెఱింగించి తగిన సంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులంజేసి దృష్టివిషయ దుస్సహుండైన నహుషు గెలుచు నుపాయంబువిచారించు నవసరంబున.

క॥ కష్టుండగు నానహుఁడు నష్టాత్మకుఁ
డయ్యె దివిజనాయకనీ యు।
త్కృష్టచరితమున సురలకుఁ
దుష్టిగ నిజరాజ్యసంగతుఁడవగుమనుచున్।

క॥ మునివరుఁడైన యగస్త్యుఁడు సనుదెంచిన
శతమఖుండు సమ్మత నుచితా।
ననమిడి యర్ఘ్యముఁ బాద్యము నొన
రిచి యిట్లనియె సవినయోక్తి నతనితోఁ ।

ఆ॥ అధికవిభవ మెసఁగ నసమానశక్తి స
నాథుఁడగుచు నున్న నహుషుఁ
డిప్పుడేమిక తనభాగ్య విహీనుఁ
డై యుజ్వలఁ శ్రీదొఱంగె మునివరేణ్య చెపుమ।

## అగస్త్యుఁడింద్రునకు నహుషభ్రష్టతఁ దెలుపుట.

వ॥ అనిన విని యమ్మునీంద్రుండిట్లనియె. నన్నహుషుని మోచి వేసరుచున్న మును లతనికడ గోష్ఠీవినోదంబులనుండి బ్రాహ్మణంబుల

యున మంత్రంబులు గోసంప్రోక్షణంబునందుఁ జెప్పఁబడి యుండునవి నీకుఁ బ్రమాణ భూతంబులగునె యని యడిగినం బాపనిశ్చయుండై యతండమ్మంత్రంబులు ప్రమాణంబులుగావనిన, నేనమ్మాటని షేధించి పూర్వాచార్యులచేత నభినందితంబులగు మంత్రంబులు నిందించుట యజ్ఞానంబని వివాదంబు సేసిన, నతండు కోపించి మదీయమస్తకంబు దన్నిన నతనిగనుంగొని పుణ్యహీనుండును, తేజోహీని దీనుండును నగుట యుపలక్షించి, నీవు పూజనీయులయిన మహామునుల నిన్ను వహింపంబనిచితి, వారలు గొనియాడు మంత్రంబులు గర్హించి, తదియునుంగాక నన్నునవమానించితి గావున నింద్రపదభ్రష్టుండవై బహుసంవత్సరంబులు భూలోకంబున నురగరూపంబున నుండుమని శాపంబిచ్చి, పదంపడి యనుగ్రహించి, భవదీయవంశజాతుండై యజాతశత్రుండను పెంపుగలిగి యుధిష్ఠిరనామధేయుండైన యొక్క సత్పురుషుని సందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు వడయుఁవాడఁవనినఁ దక్షణంబ.

క॥ స్వర్గ పరిభ్రష్టుండై దుర్గతికింబోయె నతఁడు దుష్టాత్ములకున్
దౌర్గత్యము సుజనులకు ననర్గళ సద్గతియు నగుట యరుదే యందున్.

శ్రేయోకాంక్షులైనవారికి యిది మంచి యుపదేశముగను, ఇంద్రుడు యట్టి తేజోబలప్రభావాన్వితుడై యుండియు దుష్కృత్యముచే తేజోహీనుడై, దివ్యబలము క్షయించినవాడై, దేవతాసంఘబహిష్కృతుడై, భరింపరాని లజ్జతో కూడినవాడై, యెవరికిన్ని కనబడని హిమాలయ రహస్యప్రదేశమున నుండవలసిన వాడయ్యెను. నహుషమహారాజు మానవుడై యుండియు యజ్ఞదానాధ్యయన తపఃప్రభావముచే దేవతలు సంతోషించి దేవలోకమున కధిపతిగా యాహ్వానించి యభిషిక్తునిగా జేసిరి. సదాచారానుష్ఠాన ప్రభావము దీనివల్ల తెలుసుకొనవచ్చును. అట్టి ప్రభావాన్వితుడై నహుషుడుండియు నహంకరించి పరస్త్రీలను భంగపరచ జూచుటయు, పరమఋషులను తిరస్కారబుద్ధితో చూచుటవల్ల గలిగెడు పాపమభివృద్ధియై తేజోబలము లుడిగినవాడై పరమ దీనావస్థనుబొంది కట్టకడకు నగస్త్యాదిమునుల శాపమువల్ల పెనుబామై భూమిలోపడి చిరకాలము దుఃఖమనుభవించ వలసివచ్చెను. ఈలాటి ధర్మరహస్యముఁ దెలియకనే కొందరు సాధువులు

చాలా తక్కువస్థితి నుండువారలై తపోధ్యానాధ్యయనములవల్ల క్రమముగా వృద్ధిలోనికి వచ్చి గొప్పప్రభావాన్వితులై విశేషముగా భాగ్యభోగ్యములు జేరునపుడు తమ పూర్వస్థితిమఱచి భోగపరులగుటచేత యోగమునకు దూరులై మరల పతితులగు చున్నారు. ఇట్టివారిని పేర్కొనిన లెక్కలలోనికి చాలమంది రాగలరు. ఒకగురువును గురించి తనశిష్యులు జెప్పినవచనమొకటి గలదు. అదేమన, అతనికి ప్రసిద్ధులైన శిష్యులు కొందరుండిరి. వారప్పుడప్పుడు గురువుదగ్గరకు వెళ్ళి శ్రవణము జేయుటయు, భక్తిశ్రద్ధలుగల్గి గురుకార్యమును నిర్వహించు చుండిరి. కొంతకాలము జరిగినపిమ్మట వారు గురువుదగ్గరకు పోవుటగాని, గురుకార్యములు నిర్వహించుటగాని మానివేసిరి. ఒక పెద్దమనుష్యుడు పూర్వమువలె యేల మీరు గురువుదగ్గరకు వెళ్ళుటలేదని యడిగినప్పుడు శిష్యు లిట్లుచెప్పిరి. పూర్వము మేముస్నానమాచరించి, శుభ్రవస్త్రములు ధరించి, పావనమగు విభూతి ధరించుకొని గురుదేవుని దగ్గరకు వెళ్ళేవారము. ఇపుడు గురుసన్నిధానమునకు వెళ్ళిన మేము స్నానము చేయవలసి వచ్చినస్థితిలోనికి గురువుగారు వచ్చిరి. అందువలన నచ్చోటికి వెళ్ళుట మానివేయడమైనదని వచించిరి. కర్మముయొక్క రహస్యము యీలాగునుండునని ప్రతిముముక్షువులున్ను, గురువులున్ను జ్ఞాపకములో నుంచుకొనవలయును. ఆలాగున విద్యార్థిదశలో నిరాధారులై యుండునపుడు యనేకుల సహాయమునొంది, యున్నత విద్య నభ్యసించి గొప్ప యుద్యోగమును బొందినవారున్ను, బీదరికములో యుండి బహుజనుల యుపకృతిచే గొప్ప ధనవంతులైనవారిలో కొందరును, తమయొక్క పూర్వ వృత్తాంతమును మరచి ప్రవర్తించుచున్నారు. ఈ విషయమున్ను సదా జ్ఞాపకముంచందగినది. కావున యెల్లప్పుడున్ను మనుజుడు కృతజ్ఞుడై యుండవలసినదేగాని కృతఘ్నుడై జీవించరాదు. కృతజ్ఞత గల్గియుండువరకు మాత్రమే ధర్మదేవతయు, దైవమున్ను వానిని అనుగ్రహము చేయుచుండును.

శ్లో॥ బ్రహ్మఘ్నే చ సురాపేచ చోరే భగ్నవ్రతే తథా।
నిష్కృతిర్విహితా లోకే కృతఘ్నే నాస్తి నిష్కృతిః॥

తా॥ బ్రహ్మహత్య, సురాపానము, చోరత్వము, వ్రతభంగము మొదలగుదోషములకు ప్రాయశ్చిత్తము చెప్పబడినది. లోకములో కృతఘ్నవిషయమై ప్రాయశ్చిత్తమే లేదు.

---

ఓమ్

# ధర్మరాజ చరిత్రము.

ఈ చరిత్రసారమేమన, ధర్మరాజుకూడ అసత్యమును చెప్పినను టయే. ధర్మములో రాజు అనియు, అనగా ధర్మపరాయణుడనియు, సత్యవ్రతనిష్ఠగలవాడనియు, విఖ్యాతిగాంచిన ధర్మరాజుకూడ అసత్యము లోనికి దిగెనని వినునప్పుడు ఎవరికి ఆశ్చర్యముగలుగకపోవును? కావున యీగాథ అత్యద్భుతమైనదిగాను, మహదాశ్చర్యమును గలుగచేయునది గాను, మరలమరల వినుటకు ఆసక్తిని గలుగజేయునదిగాను యుంటు న్నది. ఇదిచాల అపూర్వమైనకథగా యుంటున్నది. ఎంత వినినను శ్రోత లకు తృప్తిగలుగక మరలమరల వినవలయుననియే తోచును. అంతేగాక సత్య ధర్మనిష్ఠగలవారు ప్రత్యేకముగా దీనిని వినందగినది. దీనిలోగల సారమేమన, ధర్మరాజువాక్కుతో చెప్పినదిమాత్రము సత్యమైనను మన స్సులోమాత్రము సత్యమునకుదూరమైనది. దానియొక్క పాపఫలమును, ఆక్షణమునందే అనుభవించవలసి వచ్చినది. అదంతయు ఈకథలో మీరువినగలరు. ద్రోణాచార్యుల కుమారుడగు అశ్వత్థామ మరణించె నని వినిన ద్రోణుడు మరలబ్రతుకడు. అంతేగాక, తత్క్షణమే అస్త్రశస్త్ర ముల త్యజించి సర్వేంద్రియముల నిగ్రహించుకొనును. అయితే, ఆవాక్య ముకూడ సాధారణజనులుచెప్పిన చాలదు. ఎల్లప్పుడును సత్యమునే పలికెడువ్రతముగలవాడు చెప్పవలయును. అదంతయు ఈగాథవల్ల తెలిసికొనవచ్చును దుర్యోధనునిసైన్యములో అశ్వత్థామ యనుపేరుగల ఒక మహాగజముండెను. అది ఆదినమున యుద్ధమున మరణించెను. అశ్వ త్థామ మరణించెను, అని చెప్పుటకు అనేకులు ధర్మరాజును ప్రేరేపించి నప్పటికిని, పాపము ఆ ధర్మరాజు దాని నంగీకరించలేదు. శ్రీ కృష్ణుని పన్నాగమువలన చెప్పక తప్పినది కాదు. శ్రీకృష్ణభగవానుడుపదేశించిన

యుపాయమేమన, ఓ ధర్మరాజా! మీరు అసత్యము చెప్పబనిలేదు. అశ్వత్థామయను గజేన్ద్రిడీదినము యుద్ధములో మరణించెను. కావున అద్దానిని చెప్పిన అంతయేచాలును. దీనియందసత్యమేమున్నది? అని శ్రీకృష్ణుడు ప్రేరణజేయుటవలన అశ్వత్థామచచ్చెను అని వెలుగెత్తిచెప్పిన పిమ్మట తనకసత్య దోషమువచ్చునేమోయని భయపడి, చచ్చినది కుంజరమే యని తిన్నగా నెమ్మదిగా పలికెను. ఆశబ్దము ఎవరును విననీయక చేయుటకు సైన్యములు హాహాధ్వనులను గలుగజేయుటయు, రణభేరులను మ్రోగించుటయు చేసిరి. అదివరలో ధర్మరాజెక్కెడి రథముయొక్క చక్రములు భూమిపై నాలుగంగుళములు పై భాగమున పోవుచుండినవి. వెంటనే అందరి రథచక్రములవలె భూమిలోనికి దిగెను. చూచితిరా! ధర్మముయొక్క మాహాత్మ్యమును. దీనికన్న ధర్మరహస్యమును యేమి తెలిసికొనవలయును? ఆంధ్రభారతము.

తే॥ వలయుకాలది నెలుంగెత్తి వర్ణసమితి
యచ్చుపడఁగ నశ్వత్థామ సచ్చెననియె
నని పదంపడి యల్లన యతని చెవికి వినఁగ
రాకుండఁ గుంజరమనియె నధిప.

వ॥ ఇవ్విధంబున బలుకుటయు,

క॥ నేలకు నల్లెఁడుపొడువునఁ గ్రాలుచుమును
మెఱయుగుఱుని రథచక్రము ల
క్కాలంబున సమరజయ శ్రీలోపము
దెలియ నంటసిలబడియె నృపా.

శ్లో॥ అశ్వత్థామాహత ఇతి శబ్దముచ్చైశ్చకార హ।
అవ్యక్తమబ్రవీద్రాజన్ హతః కుంజర ఇత్యుత॥

శ్లో॥ తస్యపూర్వం రథః పృథ్వ్యాశ్చతురంగులమున్నతః।
బభూవైవంతు తేనోక్తే తస్యవాహాఽస్పృశన్మహీమ్॥

"సంస్కృత మహాభారత ద్రోణపర్వము" దీనిఅర్థము పై జెప్పబడినదే.

ఈరహస్యము తెలియక భాగవతములో శుక్రాచార్యులు చెప్పిన అసురనీతిని కొందఱు పలుకుచుందురు. కావుననే గురుడగు శుక్రాచార్యుని వాక్యమును బలిచక్రవర్తి తిరస్కరించుటకు కారణమైనది.

శుక్రాచార్యుడు అసురగురుడు కావున ఆయనచెప్పినది అసుర ధర్మమే గాని దేవధర్మముగాదు. బలిచక్రవర్తి అసురలలో చేరిన వాడైనను గుణముచే దేవతా లక్షణముగలవాడైనందుచేతనే ఈలాగున చెప్పుటకు కారణము. శుక్రాచార్యుని వాక్యము.

ఆ॥ వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమానభంగమందు
చకిత గోకులాగ్రజన్మ రక్షణమందు
బొంకవచ్చు నఘముపొందఁడధిప.

జనులు ఈసత్యమును తెలియక భాగవతమున భగవంతుడు పై పద్యమును చెప్పినటుల వచింతురు.

బలిచక్రవర్తి వాక్యము.

మ॥ నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నౌ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్॥

ఈపద్యమునుగూడ చదువక పోవుటచేతనే జనులు విపరీతబుద్ధి గలవారగుచున్నారు. భాగవతము అష్టమస్కంధమును చూడుడు. ధర్మములో సామాన్యధర్మమనియు, విశేషధర్మమనియు ఇరుతెగలు. శుక్రాచార్యుడుచెప్పినది సామాన్యధర్మము. అందువల్లనే అట్టివాక్యముచే "అఘముపొందడనఘ" అని ప్రయోగించుటకు కారణము శుక్రాచార్యుడుచెప్పినరీతిగా చెప్పినచో పాపమును మాత్రము పొందడు, కాని మోక్షమునకు, జ్ఞానమునకుహానిగలుగదనిచెప్పలేదు. అంతేగాక సత్యవాది పొందెడు నిత్యసుఖముగలుగదని గ్రహించుకొనవలయు. కావున జ్ఞానము గలుగవలసి యుండిన, మోక్షము పొందవలసి యుండిన తప్పక సత్య ధర్మములను యుల్లంఘింపకనే ప్రవర్తించవలయు. గృహస్థాశ్రమములో యుండిన అట్టి సత్యధర్మములలో యుండుట ప్రయాసము. కావుననే ధర్మరాజాదులు అయిదుగురును, ద్రౌపదియు అంత్యకాలమున గృహస్థాశ్రమమును విడచి వానప్రస్థాశ్రమము నవలంబించి మహాప్రస్థానమున ప్రవేశించుటకు కారణము. ఈ విషయము మహాభారత మహాప్రస్థాన

పర్వమున చూడఁగలము. సత్యములోఁగూడ సామాన్యమనియు, విశేషమనియు రెండువిధములు గలవు. సామాన్యసత్యము మనుస్మృతిలో యీలాగున చెప్పడమైనది.

శ్లో॥ సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమ ప్రియం।
ప్రియంచ నానృతం బ్రూయాదేషధర్మస్సనాతనః॥

తా॥ విన్నది విన్నట్లును, చూచినదిచూచినట్లును, చెప్పుట సత్యము. అట్టిసత్యమునే చెప్పవలయును. ఎదుటివాని మనస్సునకుదగినట్లు చెప్పుట ప్రియము. అట్టిప్రియమును పలుకవలయును. సత్యమైనను అప్రియమును చెప్పరాదు. ప్రియమయ్యును నసత్యము బలుకరాదు. ఇదివేద మూలము గాన ననాదియగు ధర్మము.

దీనియందు మొదట నిజమును చెప్పెను. తర్వాత కొంతసవరణ చేయడమైనది. అయితే దానియందున్న సత్యమైనను జనులకహితమైన దానిని చెప్పకూడదనియు, జనులకు హితమైనదైనను అసత్యమును చెప్పరాదనియు తెలుపడమైనది. ఇది చాలా ధర్మసందేహముతో కూడినది. ఈ విషయములో సత్యవ్రత నిష్ఠగలవాడు యెట్లు ప్రవర్తించు కొనవలయునో, వారికి వారే ఆలోచించుకొనవలయును. ముఖ్యముగా దీని సారమేమన, సత్యమేచెప్పునది అయినను, అది ప్రశాంతముగ ప్రసన్నముగ జనులమనస్సునకు హృద్యమైనదిగాను యుండవలయునేగాని, కోపముతో గాని, కఠోరవాక్యముతోగాని అశాంతి కరముగ చెప్పకూడదనిభావము. అయితే జనులకు సంతోషకరమై ప్రీతికరమైనదని తలంచి అతిశయోక్తి గాని, అసత్యభాషణముగాని చెప్పవలదు. ఇక విశేషధర్మమును గుఱించి సూతసంహితలో చెప్పినదానిని చూడుడు.

శ్లో॥ యత్త్వదు ష్టేన్ద్రియైర్దృష్టం శ్రుతం వేదవిదాంవర।
తస్యైవోక్తిర్భ వేత్సత్యం విప్రతన్నాన్యథా భవేత్॥

తా॥ కండ్లార యెట్లుచూచినదో, చెవులార యెట్లువిన్నదో, ఆ ప్రకారమితరేంద్రియముల చేత యెట్లు గోచరించినదో, అది ఆలాగున చెప్పుటయే సత్యమనంబడును. ఇదే విశేష సత్యముయొక్క స్వరూపము. ఇట్టి గుణము గలవాఁడే సత్యస్వరూపుడగు దైవమును పొందగల్గును. గీతలోను ఈ సత్యమును గుఱించి తెలుపడమైనది.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥

తా॥ పరుల మనస్సును నొప్పించనిదియు, నిజమైనదియు, ప్రియమైనదియు, హితమైనదియు, యుండునట్టిదియు వాక్య మెద్దిగలదో అట్టి వాక్యమున్ను, వేదము, ఉపనిషత్తు, భగవద్గీత పఠించుటయు, ప్రణవాది మంత్రములను జపించుటయు, వాచకీయ సత్యమనియు, తపస్సనియు గ్రహించంతగినది. దీనివల్ల వాక్శుద్ధియు గల్గును. వాక్శుద్ధిగలవాడు వచించినదంతయు వచించినట్లే జరుగును. అదియే దానిచే గల్గెడు ప్రయోజనము.

శ్లో॥ యస్యవిద్వాన్ హి వదతః క్షేత్రజ్ఞోనాభిశంకతే।
తస్మాన్న దేవాః శ్రేయాంసం లోకేఽన్యం పురుషం విదుః॥

తా॥ ఎవడు చెప్పునప్పుడు సర్వజ్ఞుడగువాని యంతరాత్మ, ఇది సత్యమా, లేక అసత్యమా, అని తెలిసికొనుచున్నదో, అట్టి అంతరాత్మకు సాక్షిగ సత్యమునే చెప్పువాడు, లోకములో వానికన్న అధికుడగు మహాపురుషుడు లేదని దేవతలు వచింతురు.

శ్లో॥ సత్యేనార్కః ప్రతపతి సత్యే తిష్ఠతి మేదినీ।
సత్యం చోక్తం పరోధర్మః స్వర్గస్సత్యే ప్రతిష్ఠితః॥

తా॥ సత్యముచేతనే సూర్యుడు ప్రకాశించుచున్నాడు. సత్యమందే యీభూమి నిలుచుచున్నది. సత్యము చెప్పుదానికన్న పరమైన ధర్మము మరియొకటిలేదు. స్వర్గమున్ను సత్యమందే నిలకడ గల్గియున్నది.

ఇప్పుడు భాగవతమున శుక్రాచార్యుడు చెప్పిన "వారిజాక్షులందు" అను చెప్పిన కథాసారమును సంగ్రహముగా ఇచ్చుట తెలిపెద.

శుక్రాచార్యుని వచనము.

సీ॥ దనుజేంద్ర యీతఁడు ధరణీసురుడు గాడు
దేవకార్యంబు సాధించు కొఱకు
హరివిష్ణుఁడవ్యయుం డదితిగర్భంబునఁ
గశ్యపసూనుఁడై కలిగెనకట
మొఱఁగకీతని కోర్కినిచ్చెద నంటివి
దైత్యసంతతి కుపద్రవమువచ్చు

నీలక్ష్మి తేజంబు నెలవునైశ్వర్యంబు
వంచించి యిచ్చుదావాసవునకు.

ఆ॥ మొనసి జగములెల్ల మూడుపాదంబుల
నఖిలకాయుడగుచు నాక్రమించు
సర్వధనమువిష్ణు సంసర్జనముసేసి
బడుగుపగిదినెట్లుబ్రదికెదీవు.

బలిచక్రవర్తి వాక్యము.

వ॥ అని యిట్లు హితంబువలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలిత లోచనుండై యశస్వి యిట్లనియె.

సీ॥ నిజమానతిచ్చితి నీవుమహాత్మక మహిని గృహస్థ ధర్మంబునిదియ
యర్థంబుగామంబుయశమునువృత్తియు నెయ్యది ప్రార్థింపనిత్తుననియు
నర్థలోభంబుననర్థి బొమ్మనుకెట్లుపలికిలేదను కంటెబాపమెద్ది
యెట్టిదుష్కర్ముని నేభరించెదగాని సత్యహీనుని మోవజాలననుచు;

తే॥ బలుకడేతొల్లిభూదేవిబ్రహ్మతోడ సమరమునసుండితిరుగకచచ్చుకంటె
బలికిబొంకకనిజముఁనబరగుకంటెమానధనులకు భద్రంబుమఱియుగలదె.

శా॥ కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతింబొందరే
వారేరీసిరిమూటగట్టికొని పోవం జాలిరే భూమిపై
బేరైనంగలదే శిబిప్రముఖులుంబ్రీతిన్ యశఃకాలములై
యీరేకోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా॥

శ్లో॥ సత్యమేవేశ్వరో లోకే సత్యే ధర్మస్సదాశ్రితః।
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరంపదమ్॥

తా॥ లోకములో సత్యమే ఈశ్వరుడు, ఈశ్వరుడే సత్యము. ధర్మమంతయు సత్యము నాశ్రయించియున్నది. సకలమునకున్ను సత్యమే మూలాధారము. సత్యమునకన్న పరమపదము అనగా, బ్రహ్మపదము మఱియొకటిలేదు.

శ్లో॥ గృహకర్మసమాసక్తం అహంబ్రహ్మేతి వాదినం।
కర్మబ్రహ్మోభయభ్రష్టం తన్త్యజేదన్త్యజం యథా॥

తా॥ గృహస్థాశ్రమకర్మములతో సంబంధించిన మనస్సుగలవాడై మహావాక్యముచే చెప్పబడెడు "అహం బ్రహ్మాఽస్మి" అను

వచించువానిని కర్మయందును బ్రహ్మమందును ఉభయత్ర భ్రష్టుడని తలంచవలయును. అట్టివానిని పవిత్రకర్మలనుండి చండాలగుణముగల వానిని త్యజించినటుల ఉపేక్షించందగినది.

శ్లో॥ మర్త్యోఽహమితి సన్ధాయ మ్రియతే జాయతేచసః।
బ్రహ్మోఽహమితి సన్ధాయ ముచ్యతే నచ జాయతే॥

తా॥ మర్త్యుడనను బుద్ధి యెంతకాలమువఱకు మానవునికి గలిగియుండునో అంతవరకును మరణించుటయు, జన్మించుటయు జరుగుచుండును. బ్రహ్మమే తానని అనుసన్ధానము దృఢముగా గల్గియుండిన తప్పక ముక్తుడగును. వాడు మరల జన్మించడు.

శ్లో॥ బ్రహ్మచర్య మహింసాంచ సత్యంచాపరిగ్రహం చ।
యత్నేన పే-రక్షత హేరక్షత హేరక్షతేతి।

ఈవాక్యము ఆత్మప్రియశిష్యునికి ఒకముని యుపదేశించినది. ఓనాయనా! బ్రహ్మచర్యము, అహింసయు, సత్యము, అపరిగ్రహమున్ను ప్రయత్నపూర్వకముగా రక్షింపుమా! రక్షింపుమా!! రక్షింపుమా!!!

శ్లో॥ నానుష్ఠానాత్పరం కార్యం త్రిషులోకేషు విద్యతే॥
సత్యం సత్యం పునస్సత్యమితి మామక భాషితమ్॥

తా॥ అనుష్ఠానమునకన్న శ్రేష్ఠమైనది మూడు లోకములయందును మఱియొకటిలేదు. ఇదిసత్యము, ఇదిసత్యము, పునస్సత్యము. ఇట్లు నావాక్యము. ఓం తత్ సత్.

---

# బ్రహ్మ శాపమునొందుట.

ఇపుడు చతుర్ముఖబ్రహ్మయు, సృష్టికర్తయు, వేదపురుషుడును యగు బ్రహ్మదేవుడుగూడ దుష్కృత్యమొనర్చుటవల్ల శాపగ్రస్తుడై నట్లుశాస్త్రములలోగలదు ఇట్లుండగా సామాన్యమనుజులై యుండియేదో కొన్నివేదాంతవాక్యముల నేర్చుకొని జ్ఞానులకు పుణ్యాపాప కర్మలంటవని జెప్పుచు యెన్నియో దుర్నీతులలో ప్రవర్తించుచున్నారు. వీరుబ్రహ్మదేవునికన్న నధికులా? జగత్సృష్టి జేయుశక్తి తపస్సువల్లను, వేదపఠనము వల్లను, యోగమహిమవల్లను బొందిన చతుర్ముఖ బ్రహ్మయే కర్మ

పాశముచే బద్ధుడయ్యెనని జెప్పుచుండగా యిట్టి మానవులా పాపకర్మ ములచే బద్ధులుగాక పోదురు? బ్రహ్మదేవునికి గలిగినశాపమును గురించి శైవపురాణములో జూడందగును. ఇచట యాకథ సంగ్రహముగ దెలి పెద. ఒకకాలమున సృష్టి కర్తయగు బ్రహ్మకున్ను, పాలనకర్తయగు విష్ణువునకున్ను ఒకవాదము గలిగెను. సృష్టించువాడగుటచే బ్రహ్మ దేవుడే యధికుడనియు, పాలించువాడగుటచే విష్ణువే యధికుడనియు భేదముకలిగినందుచే, పరమశివుని దగ్గరకువెళ్ళి మాలో నెవరధికులని ప్రశ్నింపగా యీశ్వరుండది వట్టిమాటతో జెప్పందగినది కాదు. మీా సామర్థ్యమునుజూచి నిశ్చయించవలసి యుండుననియు, అందుచే మీాయిరువురిలో నెవరైన నొకడు నా శిరమునుగాని, పాదమును గాని చూచి ముందుగా వచ్చేవారెవరో వారే గొప్పవాడని నిర్ణ యించెదనని చెప్పి యీశ్వరుండు జ్యోతిరూపుడై యుండెను. బ్రహ్మ హంసవాహనము గలవాడగుటచే హంసమునెక్కి శిరమును జూచుట కున్ను, విష్ణుమూర్తి శ్వేతవరాహరూపమును ధరించి పాదమునుచూచు టకున్ను వెళ్ళిరి. విష్ణుభగవానుడు అతల వితల పాతాళాదిలోకమువరకు వెళ్ళినను జ్యోతిర్మయుండగు యీశ్వరునియొక్క పాదాంతము కనబడక పోవుటచేతను, భూమిని త్రవ్వినందుచే ముఖము శిథిలమై రక్తముప్రవ హించుటచే శివరూపమనంతమని తలంచి భూలోకమునకు వచ్చెను. బ్రహ్మ హంసమునెక్కి భూర్భువాదియేడులోకములు దాటినప్పటికిహంస యొక్క ఱెకలన్నియు రాల్పోయినందుచే పైకిపోజాలకను, జ్యోతిర్మ యుడగు ఈశ్వర శిరాంతము కనుపింపక బోవుటచేతను మఱల భూలోకమునకు తిరిగివచ్చెను. అప్పటికి వీరిరువురకున్ను యెన్నియో యుగములు గడచిపోయెను. అయితే వారిద్దరకున్ను యీశ్వరుండొక వరమిచ్చెను. అదేమన, నాయొక్క పాదశిరస్సులంతము కనుగొనుట ప్రయాసమని తోచునో, మరల భూలోకమునకు వచ్చుటకుతలంపు గలు గునో ఆక్షణములోనే భూలోకమునవచ్చి చేరగలరని యనుగ్రహముచేసి యుండెను. అందువల్ల విష్ణుదేవుడు శివునియొక్క పాదాంతము కనబడుట నసాధ్యమని తలంచిన వెంటనే భూలోకమున వచ్చిచేరెను. కొంతసేప యిన పిమ్మట బ్రహ్మదేవుడున్ను భూలోకమునకువచ్చెను. దేవతలున్ను

మునులున్ను, సిద్ధులున్ను, నిండియుండు నా సభలోముందుగా పరమ శివుండు విష్ణుమూర్తి నడిగెను. అత్తరి నారాయణుండు వేదవాక్యము లచే స్తోత్రముచేసి, ఓ పరమశివమూర్తీ! నీవనంతుడవు. గావున నీపాదాం తము జూడజాలనయితినని పరమభక్తితో సత్యము వచించెను. మఱల బ్రహ్మదేవునితో ఈశ్వరశిరస్సుకంతము చూచితివా? యని యడుగగా చూచితినని యసత్యముజెప్పెను. సాక్షులెవరనియడుగగా కామధేనువు, కేతకీపుష్పములని బ్రహ్మ తెలిపెను. అప్పుడు కామధేను, కేతకీపుష్పముల నడిగినప్పుడీశ్వరుండుగ్రకోపముగలవాడై యసత్యము చెప్పినందుచే యీ ముగ్గురుని శపించెను. పూర్వము బ్రహ్మదేవుని కైదు ముఖము లుండెను. అసత్యముజెప్పిన ముఖమును ఈశ్వరుండు గోరుచేద్రుంచి పారవైచెను. అంతేగాక భూలోకములో మీకొక దేవాలయముగాని, పూజలుగాని, నోములుగాని యుండకూడదనికూడ శపించెను. కామ ధేనువసత్యము జెప్పినప్పుడు తోకమాత్రము లేదు లేదను సంజ్ఞచూపే లాగున మూడుసార్లూగించినందుచే గోముఖముచే మలభక్షణముజేసే లాగుననున్ను, ముఖమున జ్యేష్ఠాదేవి నివసించేలాగుననున్ను శపించెను. తోక సత్యమును వచించినందుచే పుచ్ఛమునకున్ను, పృష్ఠభాగమునకున్ను గోపూజలుజేసేలాగుననున్ను, ఆవుయొక్క తోక తగిలిన పుణ్యము వల్ల ఆప్రదేశమున వచ్చెడుగోమయమున్ను గోమూత్రమున్ను అతిపావనము లనియున్ను, పంచమహాపాతకములుగూడ పంచగవ్యప్రాశనముచే నశిం చుననియు, సమస్తదోష నివృత్తికొఱకు గోమయ గోమూత్రములుప యోగపరచిన జాలుననియు, నాశీర్వాదమొసంగెను. కావుననే గోదాన కాలమున గోవుయొక్క పుచ్ఛమును బూజించి యాతీర్థమును శిరమున జల్లుకొనుటకు కారణమైనది. ఇప్పుడుగూడ ప్రాతఃకాలమునగాని, యాత్రాసమయమునగాని, గోముఖమును జూచినవెంటనే పృష్ఠభాగము జూడవలయునని జెప్పుటకుకారణము. పృష్ఠభాగమున లక్ష్మీదేవికి నివాసమేర్పరచెను. మొగిలి పువ్వును శపించి నీవసత్యసాక్ష్యము జెప్పి నందుచే ఈశ్వరసంబంధమైన యే పూజలకున్ను యుపయోగపడకపోవు టయేగాక విషయస్వభావముగల స్త్రీల కేశములోయుండెలాగునశాపము నిచ్చెను. ఒక అసత్య వాక్యముచేతనే బ్రహ్మదేవునకు భూలోకములో

నొక దేవాలయముగాని, బ్రహ్మప్రీతికర వ్రతములుగాని లేకపోయెను. అదియునుగాక నొకశిరస్సుగూడ లేని దురవస్థగలిగెను. అట్లు గానిచో, శివవిష్ణ్వాదులకువలె దేవాలయములున్ను, యుత్సవములున్ను, పూజలున్ను బ్రహ్మకుగూడ యుండవలసినవి గదా? విష్ణుదేవుడు సత్యము జెప్పినందుచే సమస్తయజ్ఞాది క్రతువుల కధిపతిగాను యజ్ఞఫల భోక్తగాను, యుండేలాగున యీశ్వరుండాశీర్వదించినదేగాక సమస్త యజ్ఞముల ఫలమున్ను శ్రీవిష్ణ్వార్పణముగ జేసలాగుననున్ను విధించెను. కావుననే "పంచాననం పద్మజం" అనిశాస్త్రములో విధించుటకుకారణమైనది.

శ్లో॥ ఉపేక్షా నోచేత్కిం న హరసి భవద్ధ్యాన విముఖాం
దురాశా భూయిష్ఠాం విధిలిపిమశక్తో యది భవాన్॥
శిరస్తద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్॥

(అని శివానందలహరీ)

తా॥ సర్వలోకాధీశ్వరా! (నన్ను రక్షించుటయందు నీకుపేక్ష కలదేమో) అట్లుపేక్ష లేనిచో దుష్టములైన తలంపులతో నిండినదియు, నీధ్యానమునుండి పరాఙ్ముఖమైనదియు, నాముఖము మీది బ్రహ్మవ్రాతను యెందుకు తుడిచివేయవు? నీ వశక్తుడవేని, గోటితో త్రుంచనలవిగాని ఆ మిక్కిలి దృఢమైన బ్రహ్మసంబంధమైన ఐదవ శిరస్సు ప్రయత్నమక్కరలేకుండ చేతిగోటి కొనచేతనే యెట్లు త్రుంచివేయబడినది?

ధర్మచర్యయా, జఘన్యోవర్ణః, పూర్వం పూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ। అధర్మచర్యయా, పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ. (అని ఆపస్తంభము.)

తా॥ ధర్మానుష్ఠానమువల్ల నిమ్నవర్ణములోయుండు వాడైనను పై పై వర్ణమును బొందుచున్నాడు. జాతి పరివర్తనముగలది. ఆలాగున ధర్మప్రవృత్తివల్ల యుగ్రజాతి యందుండు వాడైనను, క్రమక్రమముగా నిమ్నజాతి స్థితిలోనికి వచ్చును. జాతియనునది సదా పరిణామముతో గూడినది. ఉచ్చ నీచప్రవర్తనములనుసరించి అగ్రజాతి నిమ్నజాతిలోని

కిన్ని, నిమ్నజాతి అగ్రజాతిలోని కిన్ని, మారుచుండును. మనువున్ను యీలాగునే చెప్పెను.

శ్లో॥ శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం।
క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ॥

తా॥ సద్ధర్మానుష్ఠాన తపస్సుచే శూద్రావస్థలో నుండువాడు బ్రాహ్మణావస్థను బొందుచున్నాడు. ఆలాగుననే క్షత్రియుడైనను వైశ్యుడైనను; పైజెప్పిన రీతిగా జేసినచో బ్రాహ్మణత్వము బొందును. బ్రాహ్మణావస్థలోనుండు వాడైనను కర్మలోపము గలిగెనేని, క్షత్రియావస్థలోనికి గాని, వైశ్యావస్థలోనికి గాని, శూద్రావస్థలోనికి గాని వచ్చును.

శ్లో॥ భావశుద్ధి విహీనానాం సమస్తం కర్మనిష్ఫలం।
తస్మాద్రాగాదికం సర్వం పరిత్యజ్య సుఖభవేత్

తా॥ ఆత్మశుద్ధి లేనివారి జప, ధ్యాన, యోగ, తపస్సులన్నియు నిష్ఫలములే. అందువలన అంతఃకరణములో గల రాగద్వేష కామ క్రోధాది దోషములను పరిత్యజించినవాడు ఆత్మశాంతిని, ఆత్మ సుఖమును పొందగలును.

శ్లో॥ అంతశ్శుద్ధి విహీనశ్చ బహిశ్శుద్ధిం కరోతి యః ।
అలంకృతైస్సురా భాండ ఇవ శాన్తిం న గచ్ఛతి ॥

తా॥ ఆత్మశుద్ధి లేనివాడై బాహ్యశౌచముగల్గి భస్మ, రుద్రాక్ష, కాషాయాదులచేగాని, తిలక, తులసీమాల, పావనమగు వేరు మొదలయినవి గల్గినవాడు, కల్లుకుండను బాగుగా పైజెప్పినవానివల్ల అలంకరించినను, ఘటములోపల యుండు మద్యమేలాగున అమృతము కాజాలదో, ఆత్మశుద్ధి లేనివారి స్థితియు ఆలాగున యుండును. వీరాత్మ శాంతిని బడయజాలరు.

శ్లో॥ అనిర్జితేంద్రియగ్రామో యస్తుధ్యానపరో భవేత్।
మూఢాత్మానంచ తం విద్యాద్ధ్యానంచాస్య న సిద్ధ్యతి॥

తా॥ ఇంద్రియములను చక్కగా నిగ్రహములోనుంచక ఆత్మ శుద్ధి లేనివాడై యెవడైతే యోగముగాని, తపస్సుగాని, వేదాంత బోధనముగాని చేయుచుండునో, అట్టివానిని మూఢాత్ముడని తెలిసి

కొనందగినది. వానికి ధ్యానముగాని, యోగముగాని, తపస్సుగాని సిద్ధించదు.

శ్లో॥ అన్తశ్శుద్ధివిహీనైస్తు యేఽధ్వరా వివిధాః కృతాః।
నఫలన్తి మునిశ్రేష్ఠ భస్మని న్యస్తహవ్యవత్॥

తా॥ ఓ మునిశ్రేష్ఠుడా! చక్కని ఆచరణచే ఆత్మశుద్ధి లేనివాడు అశ్వమేధ రాజసూయ నిత్యనైమిత్తిక వేదాధ్యయనాదిక్రియలనేకము చేసినను, అవియెవ్వియుఫలింపవు. అదంతయు బూడిదయందు హోమింంచిన హవిస్సువలె నిరర్థకమగును.

శ్లో॥ జపేచ్చ ప్రణవంనిత్యం జితాత్మా విజితేన్ద్రియః।
పఠేదుపనిషద్వాక్యం వేదాంతార్థాంశ్చ చిన్తయేత్॥

తా॥ కావున ఆత్మశుద్ధిగల్గి బ్రహ్మప్రాప్తి పొందవలసియుండిన ఇంద్రియములను నిరోధించి, మనస్సును స్వాధీనములోనుంచి, నిత్యము ప్రణవమును జపించవలయును. ప్రణవార్థమును తెలిపెడు ఉపనిషత్తులను పఠించవలయును. వేదాంతార్థమునుబాగుగ శ్రవణ మనన నిధిధ్యాసనల నొనర్చవలయును.

శ్లో॥ బహుజన్మకృతైః పుణ్యైః వైరాగ్యం ఖలు జాయతే।
వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నోపజాయతే॥

తా॥ అనేక జన్మములలో జేసిన నిష్కామ పుణ్యకర్మలచేతనే జీవులకు వైరాగ్యము జనించును. అట్టి వైరాగ్యమువినా యే జీవికిని జ్ఞానము యేకాలమందైనను గలుగదు.

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా యతిః।
యది స్యాత్సంయతాత్మాచ సనూనం ముక్తిమాప్నుయాత్॥

తా॥ బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వానప్రస్థుడుగాని, సన్న్యాసిగాని ఎవడైనను, సర్వేన్ద్రియములసంయమనముగల్గి శుద్ధాత్ముడై ధ్యానము చేయుచుండిన తప్పక ముక్తిని పొందగలడు. దీనియందేలాటి సందియములేదు.

శ్లో॥ నాస్తి శ్రద్ధా సమం పుణ్యం నాస్తిశ్రద్ధా సమం సుఖం।
నాస్తి శ్రద్ధా సమం తీర్థం సంసారే ప్రాణినాం నృప! ॥

తా॥ ఓరాజా ! శ్రద్ధగల స్వభావమునకు సమమగుపుణ్యము మఱియొకటి లేదు. శ్రద్ధగలస్వభావముకన్న సుఖము మఱియొకటిలేదు. శ్రద్ధగలస్వభావముకన్న మఱియొక తీర్థస్నానఫలమున్ను యీప్రపంచమున లేదు.

శ్లో॥ యావదాత్మా నలబ్ధోఽయం శుద్ధం జ్ఞానంచ నోదితం।
మలీనవిషయే రాగస్తావదజ్ఞానినో భవేత్॥

తా॥ ఎంతవఱకు ఆత్మజ్ఞానములభించలేదో, ఎంతవఱకు శుద్ధమైన ఈశ్వరజ్ఞానముదయించలేదో, ఎంతవఱకు మాలిన్యమైన విషయములలో రాగనివృత్తికాలేదో, అంతవరకు తనను అజ్ఞానినిగా తెలిసికొనవలయును.

శ్లో॥ జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోవాన్త్యజోపి వా।
సంసారసాగరం తీర్త్వా ముక్తిపారంహి గచ్ఛతి॥

తా॥ ఆత్మజ్ఞాన మనెడునావచే బ్రాహ్మణుండైనను, లేక అన్త్యజుడైనను, జనన, మరణ, దుఃఖ మనెడుసంసారసాగరముతరించి యిచ్చటనే, యీ దేహముతోగూడియున్నప్పుడే మోక్షమనెడు దరిని జేరుచున్నాడు.

శ్లో॥ చతుర్వేదార్థతత్వజ్ఞాశ్చతుశ్శాస్త్ర విశారదాః।
యజ్ఞదానతపో నిష్ఠా నమేరూపం విదంతి తే॥

తా॥ నాలుగువేదముల సారమెరింగినవాడైనను, నాలుగుశాస్త్రములను బాగుగా పఠించినవాడైనను, యజ్ఞదానతపస్సులలో నిష్ఠగలవాడైనను,నిర్మలమైన యనుష్ఠానములేనిచో, సాక్షాదీశ్వరస్వరూపజ్ఞానమును బొందజాలరు.

శ్లో॥ హరోయద్యుపదేష్టాతే హరిఃకమలజోపివా।
తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే॥

తా॥ సాక్షాత్ శంకరుండు మీకుపదేశించినను, లేకసాక్షాద్విష్ణువుపదేశించినను, లేక చతుర్ముఖ బ్రహ్మయుపదేశించినను, అంతఃకరణములోగల సంస్కారము, వాసన, సంకల్పము నశింపజేయనిచో ఆత్మశాంతిని, ఆత్మజ్ఞానమును బొందజాలరు.

శ్లో॥ ముక్తిం దదాతి వైరాగ్యం రాగో యచ్ఛతి బన్ధతాం ।
మతంవై సర్వశాస్త్రాణాం యథేచ్ఛసి తథా కురు ॥

తా॥ ఈవాక్యమష్టావక్ర మునీంద్రుండు జనకమహారాజునకుపదేశించెను. వైరాగ్యమొకటి మాత్రమే మోక్షమును గలుగజేయును. విషయమందు రాగముండువరకు బంధనమునే కలుగజేయును. ఇదిసర్వశాస్త్రములయొక్క సమ్మతము. కావున నీ యిచ్ఛయేలాగుననో యాలాగున చేయుము.

శ్లో॥ ఆత్మక్షేత్రజ్ఞ ఇత్యుక్తస్సంయుక్తః ప్రాకృతైర్గుణైః।
తైరేవతు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః॥

తా॥ ఆత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు, ప్రకృతిసంబంధగుణములతోగూడి యెంతవరకునుండునో యంతవరకుమాత్రమే పైజెప్పిన విధముగా వ్యవహరింపబడును. ఎప్పుడైతే పైజెప్పిన ప్రాకృతగుణములనుండివిముక్తుడగునో, అప్పుడీ యాత్మయే పరమాత్మయని పిలువబడును. ఇదే వేదాంతశాస్త్రముయొక్క సారాంశము.

---

# సర్వసారాంశము.

ఇదివరలో యీ గ్రంథమున వ్రాయబడిన అన్నిటియొక్క సారాంశమేమన నంతఃకరణమున ప్రపంచవాసనయగు విషయదోషమెంతవరకుండునో అంతవరకు ఆత్మశుద్ధికాలేదనియు, మోక్షము గలుగదనియు నిరూపించడమైనది. అట్లైన ఆత్మశుద్ధి యెట్లుగలుగును, ముక్తిపదమెట్లు సిద్ధించునను విషయమై యోగవాసిష్ఠాది గ్రంథములలో తెలిపిన విషయము సంక్షిప్తముగా నిరూపించి యీ గ్రంథమును పూర్తిజేయ తలంచడమైనది.

శ్లో॥ అమృతంచైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితం।
మృషయా సాధ్యతే మృత్యుః సత్యేన సాధ్యతేఽమృతమ్॥

తా॥ మానవుని హృదయమందమృత కలశమనియు, విషమగు మృత్యుకలశమనియు రెండుకుంభములు ప్రతిష్ఠితములై యున్నవి. అసత్య మార్గములో నడుచువాడు విషకుంభమును జెందుచున్నాడు. (పొందుచున్నాడు) సత్యమార్గమున సంచరించువాడమృత కలశమును జేరుచున్నాడు. సత్యముజ్ఞానమనియు, నసత్యమజ్ఞానమనియు గ్రహించుకొనందగినది.

శ్లో॥ తపోవిద్యాచ విప్రస్య నిఃశ్రేయసకరం పరం।
తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే॥

తా॥ తపస్సున్ను, ఆత్మవిద్యయున్ను, మానవునికి శ్రేష్ఠమగు శ్రేయస్సును గలుగజేయునవి. తపస్సువల్ల అంతఃకరణములోగల పాపములన్నియు నశించును. బ్రహ్మవిద్యవల్ల అమృతత్వమగు మోక్షమున్ను సిద్ధించును.

శ్లో॥ యథైకంచ సువర్ణాది మిళితం రజితాదినా।
అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహం యుతః॥

శ్లో॥ యథైవహి సువర్ణాది క్షారాదేః శోధితం శుభం।
పూర్వవన్మూల్యతాంయాతి తథా జీవోఽపి సంస్కృతేః॥

తా॥ ఏలాగున నపరంజి బంగారైనను, వెండి, రాగి, యిత్తడి, మొదలైన హీనలోహముతో కలిసిన స్వల్పవెలను పొందుచున్నదో యాలాగున యీ జీవాత్మ శుద్ధమైన జ్ఞానస్వరూపము గలదైనను, అవిద్యాది అహంభావముతో గూడునప్పుడు జీవుడని పిలువబడుచున్నాడు. అట్టిమలినావస్థను బంగారము స్ఫుటముజేసిన యేలాగున శుద్ధమగు అపరంజియగుచుండునో, అప్పుడు మంచి బంగారము యొక్క విలువను బొందుచుండునో, ఆలాగున ఈ జీవుడుగూడ గురువుచేతను, తపస్స్వాధ్యాయ వ్రతములచేతను సంస్కరింపబడినచో జీవత్వముబోయి యీశ్వరత్వమును బొందుచున్నాడు.

శ్లో॥ అవిద్యాం శ్లేష్మయా శ్లేష్మః క్షాలయన్నేవ తిష్ఠతి।
మలం మలేనాపహరన్యకిజ్ఞో రజకో యథా॥

తా॥ ఏలాగున నేర్పరియగు చాకలివాడు చౌడుమట్టిచే మలిన వస్త్రము కలిపి పుడుకబెట్టి వుతికిశుభ్రము జేయుచున్నాడో, యాలాగున

మాయామాలిన్యముతో గూడిన జీవుడు తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధాన గురూపదేశముచే శుద్ధుడుకావలయును.

శ్లో॥ తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా।
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్యతథామలమ్॥
నశ్యత్యేవ నసందేహస్తస్మాదుద్యమవాన్భవ॥

ఈ పరమోపదేశము శ్రీ వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రు నకుపదేశించినది. కొందరు జీవునియొక్క కర్మ సహజమనియు, అది స్వభావమగుటచే నశించదనియు, కావున పురుషప్రయత్నము వ్యర్థ మనియు చెప్పుదురు. ఈ వాదమును వసిష్ఠ మహర్షి అంగీకరించలేదు. దానికారణము క్రింద తెలుపబడుచున్నది. ఎట్లన, బియ్యము పుట్టుకతోనే తవుడుతోను, పొట్టుతోను ఆవిర్భవించుచున్నది. ఆలాగున రాగియు చిలుముతోనే ఆవిర్భవించుచున్నది. ఆలాగునజీవుడు నిజముగా శుద్ధ జ్ఞానస్వరూపుడైనను జన్మాంతర సంస్కారకర్మవాసనచే మలినముతో గూడినవాడైనను, పై జెప్పినవడ్లు దంచుటచేతను, తామ్రము వన మూలికలవల్ల స్ఫుటముచేతను, శుద్ధపడి చూర్ణమగునట్లునున్న, పురుషప్రయత్నము వల్ల జీవునియొక్క మాయామాలిన్యము నశించును. దీనియందు సందేహము లేదు. అందువల్ల నీవు ప్రయత్నపరుడవు కమ్ము, అని వసిష్ఠుడు చెప్పినప్పుడు దశరథమహారాజ మహాసభలో నుండు పురుషులందరున్ను, బ్రాహ్మణులును, రాజులును, ఇతరు లందరును గొప్ప హర్షధ్వని జేసిరి.

శ్లో॥ ఆత్మానదీ సంయమతోయ పూర్ణా
సత్యహ్రిదా శీల తటాదయోర్మిః।
తత్రావగాహం కురుపాండుపుత్ర
నవార్యన్యథా శుధ్యతి చాంతరాత్మా॥

తా॥ ఈ శ్లోకము ధర్మరాజుకు భీష్ముడుపదేశించినది. ప్రపంచ ములోగల తీర్థమాహాత్మ్యములన్నియుంజెప్పి, కట్టకడకు దీనినుపదే శించెను. ఈ ఆత్మనొక నదిగా వర్ణించడమైనది. ఈ యాత్మనదికి సంయమమే అనగా సర్వేంద్రియ నిగ్రహమే పూర్ణమైన జలప్రవాహము. సత్యమే లోతైనభాగము. నిర్మల శీలపవిత్రతనమే దానియొక్క రెండు

తీరములు. దయయే దానియొక్క అలలు. కావున పాండు నందనుడా! అట్టి యాత్మనదిలో స్నానమాచరింపుము. వేరు యే ప్రకారముచేతను అంతరాత్మ శుద్ధము కాదు.

శ్లో॥ అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలం।
కృత్వాజ్ఞానం స్వయంనశ్యేజ్జలం కతకరేణువత్॥

తా॥ ఆత్మస్వరూపమిట్టిదని తెలిసికొను తెలివి, అనగా అజ్ఞానముచే కలుషమైన జీవాత్మను ఆత్మస్వరూపముయొక్క నిరంతరచింతనము చేత దోషరహితునిగాజేసి, పంకిలమైన యుదకమును చిల్లగింజ యొక్క గంధమువలెనే జ్ఞానము స్వయముగా నశించును. అనగా అజ్ఞానముచే మరుగుపడియుండు ఆత్మ బ్రహ్మ విచార తపస్సులచే శుద్ధమగును. ఎటులనగా, బురదనీరు చిల్లగింజ గంధము చే శుద్ధమగునటుల యుండును. చిల్లగింజ గంధమున్ను, నీటిలోగల బురదయు, రెండును నశించినీరునిర్మలమగునటుల, సాధన అజ్ఞానముతోగలిసి రెండును లీనములై నిర్మలమైన ఆత్మజ్ఞానముమాత్రము మిగులునని భావము.

శ్లో॥ ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్॥

తా॥ ఎల్లప్పుడును తాను నిత్యశుద్ధప్రకాశాత్మస్వరూపుడను ధ్యానమువలన దివ్యౌషధముచే రోగమునశించు విధమున, పై జెప్పిన అనుష్ఠానమువలనను అంతఃకరణములోగల అవిద్యావిక్షేపాది దోషములున్ను నశించును.

శ్లో॥ నైవజన్మని సర్వస్మిన్ విద్యాఽసౌసులభాఽపితు।
శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవహి లభ్యతే॥

తా॥ అన్నిజన్మములలోను ఈ బ్రహ్మవిద్య సులభముగాదు. శమదమాది శిష్యలక్షణము సంపూర్ణముగానున్న జన్మమునందే కనబడుచున్నది.

శ్లో॥ అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్।
పుణ్యపుంజేన శుద్ధంతచ్చిత్తమేకాగ్ర్యమర్హతి॥

తా॥ ఆత్మకానిదానియందు మనస్సున రుచి లేకపోవుటయు, నాత్మయందు రుచిగలుగుటయు నేదిగలదో యది మహాపుణ్యముచే గల్గును. ఆ శుద్ధమైన చిత్తమేకాగ్ర్యమును గలిగించును.

శ్లో॥ రవిర్వాయుర్యథా వృష్టిర్లోకానాంహితకారణం।
తథా భవన్తివేదాశ్చ సర్వేషాంమోక్ష సిద్ధయే॥

తా॥ ఏలాగున సూర్య, చంద్ర, అగ్ని, వాయు, జల, వృష్టి, భూమ్యాకాశాదులు సర్వజనులకు సౌఖ్యముకొఱకు సమానముగా సర్వేశ్వరుడు యెటుల సృష్టించియున్నాడో, ఆలాగున అందఱున్ను మోక్షము పొందుటకొఱకు వేదములను గూడ అందఱికిని సమానముగాను ఈశ్వరుండు నిర్మించియున్నాడు. పంచ భూతాదులు దేహసౌఖ్యముకొఱకును, ఆత్మసౌఖ్యముకొఱకును వేదమును నిర్మించినాడు.

శ్రుతి॥ బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయచ స్వాయ చారణాయ.

తా॥ ఈవేదవాణి బ్రాహ్మణులకు వలెనే క్షత్రియులకును, క్షత్రియులకేట్లో అట్లే వైశ్యులకు, శూద్రులకు, తమ తమ పుత్రులకు, భృత్యులకు, అతిశూద్రులకు సయితము సమానముగ వర్తించును.

ఓం తత్ సత్

సమాప్తము.

---

వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు: 2-6-48 కా. 1000.

# ఇతర గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | వేదాన్త బాలబోధము | ... | ... | 2—4—0 |
| 2. | అమృత బిందూపనిషత్తు (తోహరతో) | ... | ... | 0—1—6 |
| 3. | శ్రీమద్భాగవతసారము | ... | ... | 0—1—0 |
| 4. | జిజ్ఞాసురత్నము | ... | ... | 0—1—0 |
| 5. | ఓంకారప్రభావము | ... | ... | 0—12—0 |
| 6. | శ్రీ దత్తాత్రేయోపదేశము | | ... | 0—3—0 |
| 7. | బ్రహ్మవిద్యాశిరోధ్వాదపద్ధతి | | ... | 0—4—0 |
| 8. | శ్రీ బుద్ధోపదేశము | ... | ... | 0—1—0 |
| 9. | శ్రీరామనామామృతము | ... | ... | 0—1—0 |
| 10. | బీజాక్షరవర్ణమాలిక | ... | ... | 0—0—9 |
| 11. | శ్రీ యోగవాసిష్ఠము (పూర్వార్ధము) | ... | ... | 20—0—0 |
| 12. | డిటో (ఉత్తరార్ధము) | ... | ... | 25—0—0 |
| 13. | శ్రీ మలయాళసద్గురు స్మరణామృతము | ... | ... | 0—6—0 |
| 14. | ఆత్మారామతత్త్వామృతము | ... | ... | 0—6—6 |
| 15. | రామకృష్ణ ప్రేమామృతము | ... | ... | 0—2—6 |
| 16. | శివరామకృష్ణ భజనామృతము | ... | ... | 0—2—6 |
| 17. | తులసీ బృందావనము | ... | ... | 0—2—6 |
| 18. | భజగోవిందము | ... | ... | 0—2—0 |
| 19. | అహింసాపుష్పము | ... | ... | 0—2—6 |
| 20. | శ్రీమన్నారాయణగేయామృతము | ... | ... | 0—1—6 |
| 21. | అనుష్ఠాన వేదాంతము | ... | ... | 0—7—0 |
| 22. | గృహస్థాశ్రమతత్త్వము | ... | ... | 0—5—0 |
| 23. | దుఃఖనివారణోపాయము | ... | ... | 0—4—0 |
| 24. | ధర్మపదము | ... | ... | 0—8—0 |
| 25. | గరుడపురాణసారము | ... | ... | 0—6—0 |
| 26. | యతిగీతము | ... | ... | 0—2—0 |
| 27. | శివపంచాక్షరీ భాష్యం | ... | ... | 0—4—0 |
| 28. | శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | ... | ... | 0—12—0 |
| 29. | శ్రీ గురు బోధానందామృతమయ సంజీవినీకీర్తనలు | | ... | 0—2—6 |
| 30. | ప్రశ్నోత్తరమణిరత్నమాల | ... | ... | 0—2—0 |
| 31. | శివధ్యానామృతము. | ... | ... | 0—0—9 |
| 32. | నమశ్శివాయ గేయామృతము. | ... | ... | 0—1—6 |
| 33. | శ్రీసాంబశివ గేయామృతము. | ... | ... | 0—0—6 |
| 34. | కుండలీ పరాశక్తి ధ్యానము. | ... | ... | 0—0—6 |
| 35. | ఓంకార స్మరణామృతము. | ... | ... | 0—3—0 |
| 36. | ఓంకారగీత. | ... | ... | 0—3—0 |
| 7. | శ్రీ వ్యాసాశ్రమస్థలమాహాత్మ్యము. | ... | ... | 0—4—0 |

అడ్రస్సు: శ్రీ వ్యాసాశ్రమము, యేర్పేడు పోస్టు, (చిత్తూరుజిల్లా.)